# ఆదిత్య హృదయమ్



దూడగడప వేంకట
నరసింహారావు

Cover design: Kolluri Soma Sankar

Surya image on cover is taken from
http://te.wikipedia.org/wiki/దస్త్రం:SuryanarayanaSwamy.jpg

(Public Domain)

# ఆదిత్యహృదయమ్
# బ్రహ్మకృత రామస్తవమ్
# వీతిహోత్రోత్థిత సీతాప్రదానమ్

దూడగడప వేంకట నరసింహారావు

దూడగడప వేంకట రామలక్ష్మీనరసింహమూర్తి
బాడిద పద్మనాభరావు

**Aditya Hrudayam,**
**Brahmakruta Ramastavam,**
**Veetihotroththita Seetapradanam**

*by* **Dudagadapa Venkata Narasimha Rao**



First Published in 2009

*Published by*
**Dr. B. Padmanabha Rao**
C/o. Mr. B.P. Vijayendra
B13, "Dhanastra",
RBI Senior Officers' Flats,
122, N.P. Marg, Colaba,
Mumbai - 400 005.
Cell : 94419 02858

and

**D.V.R.L.N. Moorty**
1-4-880/16, Bank of Baroda Colony,
New Bakaram, Hyderabad - 500 080.
Phone : 27618373, Cell : 99899 94995

*D.T.P. :*
**Balaji Graphics**
106, Purushottam Apartments,
Gandhinagar, Hyderabad - 500 080.
Phone : 27607125

*Printed at :*
**Charita Impressions**
1-9-1/26/B, Azamabad,
Hyderabad - 500 020.



**దూడగడప వేంకట నరసింహారావు పంతులు గారు,**
**దూడగడప సేతుబాయి గారు**

| | |
|---|---|
| జననం : 22-06-1909 | జననం : 1914 |
| మరణం : 19-03-1988 | మరణం : 16-02-1987 |

# పీఠిక

శ్రీ హరి గురుభ్యో నమః ఓమ్


అన్నవరము,
ముదినేపల్లి పోస్టు,
కృష్ణా జిల్లా - 521 325.


15-4-1977

*Dear Paddam! Hearty Blessings,*

నీవు కోరిన 'ఆదిత్యహృదయము' 'రామస్తవము'లకు ప్రతిపదార్థ తాత్పర్యములు వ్రాసి ఇందుతో పంపుచున్నాను. దీనిని అందుకొని అందినట్లుగా నాకు వెంటనే తెలియజేయగోరుచున్నాను. అప్పటికి నా ప్రయత్నము సఫలీకృతమైనదని నాకు తృప్తి కలుగుతుంది.

నీ వద్దనుండి వచ్చిన తరువాత దీనిని పంపటం కొంత బాగా ఆలస్యమే అయినది. ఈ ఆలస్యమునకు కారణం, ఆ మధ్యను నీకు ఒకసారి వ్రాసినట్లుగా నాకు పిల్లల చనువు ఎక్కువగా ఉండటం ఒకటి, రెండవది నీవు అడిగినావు గనుక నా పూర్తి ఆలోచననంతయును వినియోగించి నీకు విశదముగా వ్రాసి పంపుదమన్న కోరిక మరియొకటి. ఈ రెండు కారణములచేతను ఆలస్యముగా పంపుచున్నాను. నీవు కోరిన విధముగ నీకు విశదమగునట్లు వ్రాసితినను తృప్తితో ఆలస్యముగనే దీనిని ఇప్పుడు పంపుచున్నా, దీనియొక్క మెరుగుతరుగులు లోపా లోపములు నిర్ణయించవలసినవాడవు నీవే. నీవు దీనిని రెండుమూడుసార్లు వివరముగా సావధానముగా సాకల్యముగా చదివి - నీ మనసున కలిగిన భావములను దాపరికము లేక యథాతథముగా నాకు తెలియజేయకోరినాను. నీవు వెలువరించిన అభిప్రాయము మీద నా భవిష్యదాలోచనాసరళిని నడపుకొన గలను. కనుక తప్పక నీకు వీలైనప్పుడు నీ అభిప్రాయమును పంపగోరెదను.

నాకు ఉన్న భాషాజ్ఞానమంతయు ఆంధ్ర ప్రబంధ పఠన వలన వచ్చినదే. ప్రారంభములో స్కూలులో చదువు రోజులలో గూడ తెనుగు గ్రంథములనే నేను గురుముఖతః చదువుకొన్నాను గాని సంస్కృత కావ్యములను గురుముఖతః చదివినవి చాలా తక్కువ. తరువాత కాలములో తెనుగుకు సంస్కృతము మాతృకయైన కారణమున నేను స్వయంకృషి వలన స్వోపజ్ఞ మూలముగా సంపాదించుకొన్న అల్పజ్ఞానమే కాని విశేషజ్ఞానము తక్కువ. ఇప్పటికిని సంస్కృతమును గురుముఖతః చదివినచో ఎంత బాగుండునో అని నా మనసు ఉవ్విళ్లూరుచూ ఉంటుంది. కాని ఇక అది సంభవమయే

కార్యము కాదు. అయినను సంస్కృతసభల యందును సమావేశముల యందును నాకు తగిన గౌరవమును నేను పొందుచునేయున్నాను. శ్రీమదుత్తరాదిమఠ శ్రీపాదులు మొదటగా బందరు విచ్చేసినప్పుడు వారికిచ్చిన సంస్కృతసమ్మానపత్రమును నేనే కూర్చి వారి మన్ననల నందినాను. ఇప్పటి వరకును వారియొక్క అనురాగమునకు కారణమదియే.

ఈ అర్థతాత్పర్యములను కూడా నేను సాధ్యమైనంత వరకు ఏ పొరబాట్లును లేకుండనే వ్రాసినానని ఎంచుచున్నాను. ఏమేని పొరబాట్లు (అర్థములు వ్రాయుటలో) ఉన్నచో తెలిసినవారికి చూపి సరిచేయించవచ్చును. ఇవి వ్రాసిన మీదట రామాయణమంతకును కనీసము సుందరాకాండకైనను ఇటుల వ్రాసినచో ఇతర భాషాకోవిదులైనవారికి సంస్కృతభాష ప్రారంభకులకు (ముఖ్యముగా సుందరకాండ పారాయణ చేయువారికి) ఎక్కువ ఉపయోగ కరము కాగలదని మనసుకు ఉత్సాహముగా నున్నది. నీవు దీని మీద యిచ్చే అభిప్రాయము ఈ ఉత్సాహము కార్యరూపమగుటకు ప్రోద్బలకారి కాగలదు. మనము తిరిగి కలసికొన్నప్పుడు వీని విషయమంతయును మాట్లాడుకొన వచ్చును. నీ అభిప్రాయమును మటుకు తప్పక పంపుము. అందినట్లు వెంటనే తెలియజేయుము.

గ్రహించవలెను
**దూ.వెం. నరసింహారావు**

# మనవి

బాడిద రాంబాయమ్మగారు, బాడిద మాధవరావు పంతులుగారు - నాకు మాతాపితరులు. దూడగడప శ్రీనివాసరావు పంతులు గారు, దూడగడప వేంకట నరసింహారావు పంతులు గారు నాకు మేనమామలు. నా తల్లిదండ్రులు, నా మేనమామలు - నాకు జ్ఞానప్రదాతలు, స్ఫూర్తిప్రదాతలు. నా ఇరువురు మేనమామల లోను, కనిష్ఠులు వేంకట నరసింహారావు పంతులు గారు నాకు చిరస్మరణీయులు. వారికి కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు, కోలవెన్ను రామకోటీశ్వరరావు గారు, బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాలలో విద్యాగురువులు. భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు వారికి స్వాతంత్ర్య సమరస్ఫూర్తిని ఇచ్చినవారు. బెజవాడ గోపాలరెడ్డి గారు వారికి రాయవేలూరు జైలులో సహవాసులు. ఆంధ్రప్రదేశ్ శాసన మండలి ప్రప్రథమ అధ్యక్షులు గొట్టెపాటి బ్రహ్మయ్య గారు, మద్రాసు రాష్ట్ర హరిజన సంక్షేమ శాఖమంత్రి వేముల కూర్మయ్యగారు వీరికి రాజకీయ సహచరులు.

అన్నిటికీ మించి, దూడగడప వేంకటనరసింహారావు పంతులుగారు బుధజన విధేయులు. తమకంటే పెద్దవారిని అందరను గురువులుగా భావించువారు. ప్రత్యేకముగా - తన అన్నగారైన శ్రీనివాసరావుపంతులుగారి యెడల, సోదరి అయిన మా తల్లిగారి యెడల, మా తండ్రిగారి యెడల అపరిమితమైన - గురుభక్తి కలిగినవారు. నాపైన పుత్రవాత్సల్యము అధికముగ కలిగినవారు.

వారికి మేనల్లుడనగుట నా పూర్వజన్మ సుకృతము.

1975, 1976 సంవత్సరములలో నాకు ఉద్యోగరీత్యా ఇబ్బందులు, కష్టములు సంభవించినవి. "తరణోపాయముగ ఆదిత్యహృదయమును పఠించినచో మనశ్శాంతి కలుగు"నని, ఉద్యోగ సహచరులు, కీర్తిశేషులు శ్రీ శివాజీ మొక్కపాటి గారు సలహా ఇచ్చినారు. శ్రీ మామిడిపూడి రామకృష్ణయ్యగారు రచించిన సంగ్రహ రామాయణ పఠన ప్రారంభము చేసి, తోడుగా ఆదిత్యహృదయమును అనుదినము ప్రార్థనగాను, పారాయణగాను, నేటికినీ చేయుచునే ఉన్నాను. ఆ సమయములోనే ఆదిత్య హృదయము, బ్రహ్మకృత రామస్తవము, వీతిహోత్రోత్థిత సీతాప్రదానము, ప్రతిపదార్థ తాత్పర్య సహితముగ వ్రాసి పంపవలసినదిగా మా మేనమామ గారిని కోరితిని. వారు అత్యంత కరుణతో, ఆదరముతో ఏప్రిలు 1977 లోనే పంపిరి.

ఆ రచనతో బాటుగా వారు నాకు వ్రాసిన లేఖను ఈ గ్రంథమునకు "పీఠిక"గా ప్రచురించడమైనది. "దీనియొక్క మెరుగుతరుగులు, లోపాలోపములను నిర్ణయించవలసినవాడవు నీవే" అని వ్రాయుటలో వారి మనఃప్రవృత్తి ద్యోతక మౌతుంది. నాకు వారికున్నంత మేధస్సు మృగ్యము. నా జ్ఞానము వారి జ్ఞానము

ముందు అత్యల్పము. నాకు తోచిన నాలుగు సందర్భములలో మాత్రము వారి రచనా ప్రాదుర్భావమునకు భంగము కలుగకుండు నట్లుగ, నా అభిప్రాయములను నిమ్నలిఖితములుగ సూచించినాను.

ఈ ప్రచురణ 30 సంవత్సరములకు పూర్వమే జరుగవలసినది. వారివద్ద నుంచి నాకు చేరిన కొద్దిరోజులకు, వారి జ్యేష్ఠపుత్రుడు చిరంజీవి వేంకటరామలక్ష్మీ నరసింహమూర్తికి లాంఛనముగ చూపితే, చాల సంతోషించి, "మా తండ్రిగారి రచనను నేనే ప్రచురించుతాను" అని చెప్పగా, దానిని వారికి ఇచ్చినాను. అది వారి వద్దనే ఉండినది. మా యిరువురి కోరిక (ముఖ్యముగా నా చిరకాలవాంఛ) నా మేనమామ గారి శతజయంతి సంవత్సరములో సాఫల్యమైనది.

ఆగష్టు 2007లో నా ఆప్తమిత్రులు, హైదరాబాదు వాస్తవ్యులు, తత్త్వ విషయాసక్తులు శ్రీ NPBL శర్మగారితో ఈ విషయమును ప్రస్తావించగా, వారు ప్రచురణ విషయములో తమ మిత్రులైన శ్రీ P.P.C. జోషి గారు సహాయము చేయగలరని సెలవిచ్చిరి. అంతట P.P.C. జోషిగారి సహకారముతో తయారు అయిన ఈ గ్రంథమును భక్తితో, హృదయపూర్వక దక్షిణగా బుధ జనులకు సమర్పించుచున్నాము.

పునః శ్రీయుతులు శర్మగారికి, జోషిగారికి, ముద్రాపకులు చరిత ఇంప్రెషన్స్ వారికి కృతజ్ఞులము. దూడగడప శ్రీనివాసరావు పంతులు గారికి, దూడగడప వేంకటనరసింహారావు గారికి, బాడిద రాంబాయమ్మ, బాడిద మాధవరావు పంతులు గారలకు మా వందన సహస్రములు.

- ***బాడిద పద్మనాభరావు***
***దూడగడప వెంకటరామలక్ష్మీ నరసింహమూర్తి***

మహాశివరాత్రి
23-2-2009

# శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
# యుద్ధకాణ్డే
# ఆదిత్యహృదయమ్ నామ
# సప్తోత్తర శతతమస్సర్గః
# సార్థతాత్పర్యమ్

శ్లో. *తతో యుద్ధపరిశ్రాన్తమ్ సమరే చిన్తయాస్థితమ్,*
*రావణంచాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్.* 1

**పదవిభాగమ్** : తతః, యుద్ధపరిశ్రాన్తమ్, సమరేచిన్తయాస్థితమ్, రావణమ్, చ, అగ్రతః, దృష్ట్వా, యుద్ధాయ, సముపస్థితమ్.

**వాక్యక్రమము** : తతః యుద్ధపరిశ్రాన్తమ్ యుద్ధాయసముపస్థితమ్ రావణమ్ అగ్రతః దృష్ట్వా చ సమరే చిన్తయా స్థితమ్.

**అర్థము** : తతః = తరువాత (ఎట్టఎదుటకు రావణుని రథము వచ్చిన తరువాత); యుద్ధపరిశ్రాన్తమ్ = యుద్ధము చేసి అలసటను పొందిన; యుద్ధాయ = యుద్ధము కొరకు; సముపస్థితమ్ = దగ్గరకు వచ్చిన; రావణమ్ = రావణుని; అగ్రతః = ఎట్టఎదుట; దృష్ట్వా, చ = చూచియు; సమరే = యుద్ధమందలి, చిన్తయా = ఆలోచనచేత, స్థితమ్ = ఉన్నట్టియు (శత్రుమారణోపాయము ఏమిటా అని ఆలోచనలో మునిగియున్న); (రాముని అని ముందుశ్లోకముతో అన్వయము).

**తాత్పర్యము** : తీవ్రరోషుడైన రావణుడు ఎట్టఎదుటకు రథము తోలించుకొని యుద్ధముకొరకు వచ్చియున్నవాడుకాగా వానివధోపాయమును ఆలోచించుచున్నవాడును యుద్ధమునందు లెస్సగా అలసియున్నవాడును (అయిన రామునివద్దకు అగస్త్యమహర్షి వచ్చెనను ముందు శ్లోకముతో అన్వయము) పూర్వసర్గయందు ప్రత్యర్థులిర్వురును చండప్రచండముగా యుద్ధముచేసి, అలసిపోగా రావణుని సారథి రథమును ప్రక్కకు తోలినట్లును అందుకు రావణుడు సారథిని కోపించి "సూతుడా! మన రథమును శీఘ్రముగా రాఘవాభిముఖముగా తోలుము. యుద్ధములో శత్రువులను చంపకుండా

ఈ రావణుడు వెనుతిరుగడు'' అని ఎక్కువైన రోషముతో రథమును రాముని ఎట్టఎదుటకు రప్పించటము వర్ణింపబడినది. అట్టి రావణుడు ఎట్టఎదుట యుద్ధోద్యుక్తుడై కనబడుచుండగా శ్రీరామునకు ఇతరమేమియు దృష్టి గోచరము గాక వాని వధోపాయాన్వేషణముననే మనసు లగ్నమై తదేకనిష్ఠతో ఆలోచించుటను 'సమరేచిన్తయాస్థితమ్'' అన్న పదము ప్రయోగింపబడి ఎక్కువ సరసముగా రాముని ధీరోదాత్త లక్షణము చదువరుల మనసుకు గోచరింప చేయబడినది.

''యుద్ధపరిశ్రాన్తమ్, సమరేచిన్తయాస్థితమ్'' అను ఈ రెండు విశేషణము లును రామునియొక్క అప్పటి పరిస్థితిని కళ్లకుకట్టుచు ఎక్కువ రసమును ఒప్పించుచున్నవి.

శ్లో. *దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్,*
*ఉపగమ్యాబ్రవీద్రామమగస్త్యో భగవానృషిః.* **2**

**పదవిభాగమ్** : దైవతైః, చ, సమాగమ్య, ద్రష్టుమ్, అభ్యాగతః, రణమ్, ఉపగమ్య, అబ్రవీత్, రామమ్, అగస్త్యః, భగవాన్, ఋషిః.

**వాక్యక్రమము** : భగవాన్ అగస్త్యః ఋషిః రణమ్ద్రష్టుమ్ దైవతైః చ సమాగమ్య అభ్యాగతః రామమ్ ఉపగమ్య అబ్రవీత్.

**అర్థము** : భగవాన్ = పూజ్యుడైన (భగవదంశసంభూతుడైన); అగస్త్యః ఋషిః = అగస్త్యమహర్షి; రణమ్ = యుద్ధమును; ద్రష్టుమ్ = చూచుటకు; దైవతైః, చ = దేవాంశసంభూతులైనవారితో (మహర్షులతో); సమాగమ్య = కూడుకొని; అభ్యాగతః = వచ్చినవాడై; రామమ్ = రాముని (వెనుక శ్లోకములో చెప్పబడిన విధముగా నున్న రాముని); ఉపగమ్య = దగ్గరకువచ్చి (చేరి); అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** : పూజ్యుడైన అగస్త్యమహర్షి దైవాంశసంభూతులైన మహర్షు లను వెంటబెట్టుకొని యుద్ధమును చూచుటకు వచ్చి ఆలోచనానిమగ్నుడైన రామునితో పలికెను. సర్వభర్త సర్వకర్తయైన విష్ణ్వవతారమూర్తి రాముడు మానవావతారమెత్తి మానవజన్మక్రమసహజమైన కష్టసుఖదుఃఖముల నను భవించుచు ఆయా సమయములందు ఆచరించదగిన కార్యకలాపములను తనకు తెలిసినవేయైనను ఆ కాలమునకు పెద్దలు, పూజ్యులు, అనుభవజ్ఞులు నైనవారలనుండి తెలిసికొని ఆచరించుచు భవిష్యత్మానవాళికి మార్గము చూపినాడు. ఆ కాలమందలి పూజ్యులు సర్వజ్ఞులునైన మహర్షులు కూడా రాముని అవతారపురుషునిగాను సర్వభర్తగాను దుష్టశిక్షణార్థము శిష్ట



రక్షణార్థము అవతారమెత్తినవానినిగాను తెలిసికొని పూజించుచునూ కూడా ప్రతి సమయమందును లక్ష్యసిద్ధిని మనసున నుంచుకొని కనిపెట్టుచూ తగు సలహా సంప్రతింపులతో అనుసరించుచూ అనుసరింపజేసుకొనుచు లక్ష్యమును సాధించుట గోచరమగుచున్నది. రెండు పక్షముల యందును ఆధునికకాలమున నిట్టి నియమము మృగ్యమగుచున్నది.

శ్లో. *రామరామమహాబాహో శృణు గుహ్యమ్ సనాతనమ్,*
*యేన సర్వానరీన్ వత్స సమరే విజయిష్య సే.* **3**

**పదవిభాగమ్** : రామ, రామ, మహాబాహో, శృణు, గుహ్యమ్, సనాతనమ్, యేన, సర్వాన్, అరీన్, వత్స, సమరే, విజయిష్య సే.

**వాక్యక్రమము** : రామరామమహాబాహో సనాతనమ్ గుహ్యమ్ శృణు వత్స యేన సమరే సర్వాన్ అరీనీ విజయిష్య సే.

**అర్థము** : రామ, రామ = ఓ రామా! (రెండుసార్లు ప్రయోగించుట ప్రేమాతి శయమును తెలుపుటకు); మహాబాహో = దీర్ఘబాహుడా! (దీర్ఘబాహుత్వము శౌర్య పరాక్రమద్యోతకము, అందుచే శత్రుసంహారము నిశ్చితము); సనాతనమ్ = ఎల్లకాలములకు సత్యమైనట్టిది (నాశనములేక శాశ్వతమైనట్టి); గుహ్యమ్ = రహస్యము (మననము చేయదగినది); శృణు = వినుము; వత్స = (తెనుగులో చంటిపిల్లలను అతిప్రేమతో 'నాయనా' అను సంబోధనకు తుల్యమైన సంస్కృతపు మాట వత్స) నాయనా; సమరే = యుద్ధమందు; యేన = దేనిచేతను; సర్వాన్ అరీన్ = అందరు శత్రువులను; విజయిష్య సే = జయించగలవో.

**తాత్పర్యము** : అగస్త్యుని రాకయే శ్రీరాముని ఆలోచనాఫలప్రాప్తి కొరకు. వస్తూనే శ్రీరామా! నాయనా! ఎల్లకాలములకు శాశ్వతమైనదియై తక్షణ ఫలము నిచ్చునదియైన రహస్యమును నీకు చెప్పుచున్నాను. దానిచేత నీవు యుద్ధములో సర్వశత్రువులను జయించగలవు. వినుము.

శ్లో. *ఆదిత్యహృదయమ్ పుణ్యమ్ సర్వశత్రు వినాశనమ్,*
*జయావహమ్ జపేన్నిత్యమక్షయ్యమ్ పరమమ్ శివమ్.* **4**

**పదవిభాగమ్** : ఆదిత్యహృదయమ్, పుణ్యమ్, సర్వశత్రు వినాశనమ్, జయా వహమ్, జపమ్, నిత్యమ్, అక్షయ్యమ్, పరమమ్, శివమ్.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : ఆదిత్యహృదయమ్ = ఆదిత్యహృదయమను; జపమ్ = జపము (మంత్రావృత్తి. ఒక మంత్రమును గాని, కొన్ని శ్లోకముల సంపుటియైన స్తోత్రమును

గాని కొన్నిసార్లు నియమముతో ప్రయతాత్ముడై ఉచ్చరించి ధ్యానము చేయుట జపమని పిలువబడుచున్నది.); పుణ్యమ్ = పుణ్యవంతమైనది (సుకృతము); సర్వశత్రువినాశనమ్ = అందరు శత్రువులను నశింపజేయునది; జయావహమ్ = జయమును కలుగజేయునది; నిత్యమ్ = ఎల్లప్పుడు, అక్షయ్యమ్ = నాశములేనిది; పరమమ్ = ఆద్యమైనది, ఉత్కృష్టమైనది; శివమ్ = మంగళకరమైనది, శుభకర మైనది.

**తాత్పర్యము** : ఆదిత్యహృదయమను జపము, పుణ్యవంతమైనది. సర్వ శత్రువులను నశింపజేసి జయమును కలుగజేయునది, ఎల్లకాలములందును నాశములేనిది ఆద్యమైనది శుభకరమైనది.

శ్లో. *సర్వమఙ్గళ మఙ్గల్యమ్ సర్వపాపప్రణాశనమ్,*
*చిన్తాశోకప్రశమనమాయుర్వర్ధనముత్తమమ్.* 5

**పదవిభాగమ్** : సర్వమఙ్గళమఙ్గల్యమ్, సర్వపాపప్రణాశనమ్, చిన్తాశోకప్రశమనమ్, ఆయుర్వర్ధనమ్, ఉత్తమమ్.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : సర్వమఙ్గళమఙ్గల్యమ్ = అన్ని శుభములకన్న శుభకరము; సర్వపాప ప్రణాశనమ్ = అన్ని పాపములను నాశము చేయునది; చిన్తా, శోకప్రశమనమ్ = విచారమును దుఃఖమును పోగొట్టునది; ఆయుర్వర్ధనమ్ = ఆయుస్సును వృద్ధి జేయునది; ఉత్తమమ్ = శ్రేష్ఠతమమైనది.

**తాత్పర్యము** : సుగమము.

శ్లో. *రశ్మిమన్తమ్ సముద్యన్తమ్ దేవాసురనమస్కృతమ్,*
*పూజయస్వ వివస్వన్తమ్ భాస్కరమ్ భువనేశ్వరమ్.* 6

**పదవిభాగమ్** : రశ్మిమన్తమ్, సముద్యన్తమ్, దేవాసురనమస్కృతమ్, పూజయస్వ, వివస్వన్తమ్, భాస్కరమ్, భువనేశ్వరమ్.

**వాక్యక్రమము** : రశ్మిమన్తమ్ సముద్యన్తమ్ దేవాసురనమస్కృతమ్ వివస్వన్తమ్ భువనేశ్వరమ్ భాస్కరమ్ పూజయస్వ.

**అర్థము** : రశ్మిమన్తమ్ = కిరణములచే వెలుగువాడును; సముద్యన్తమ్ = లెస్సగా ప్రకాశించువాడును (తనను మించిన ప్రకాశము లేనివాడు); దేవాసుర నమస్కృతమ్ = దేవతలచేతను రాక్షసులచేతను కూడా పూజింపబడువాడు; వివస్వన్తమ్ = కాంతిచేత నన్నిటిని కప్పెడువాడు; భువనేశ్వరమ్ = జగములకు, ఆకాశమునకును ప్రభువైనవాడు; భాస్కరమ్ = సూర్యుని (వెలుగు చేయువానిని) (వెలుగును చేసేవాడుగనుక నీకు వెలుగు నివ్వగలడు అని భావము); పూజయస్వ = పూజింపుము.



**తాత్పర్యము** : కాంతికి ప్రకాశమునకు స్థానమైనవాడు, తన కాంతిచేతనే లోకములనన్నిటిని ప్రకాశింపజేయువాడు, దేవతల, రాక్షసుల చేతనే పూజింప బడేవాడైనప్పుడు మానవుల సంగతి చెప్పనక్కరలేదు గదా. అట్టివానిని నీవును పూజించి వెలుగును పొంది కార్యసిద్ధి గనుము.

శ్లో. *సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః,*
*ఏష దేవాసురగణాన్లోకాన్పాతి గభస్తిభిః.* 7

**పదవిభాగమ్** : సర్వదేవాత్మకః, హి, ఏషః, తేజస్వీ, రశ్మిభావనః, ఏషః, దేవాసుర గణాన్, లోకాన్, పాతి, గభస్తిభిః.

**వాక్యక్రమము** : ఏషః, రశ్మిభావనః, తేజస్వీ, సర్వదేవాత్మకః, హి, ఏషః, దేవాసుర గణాన్, లోకాన్, గభస్తిభిః, పాతి.

**అర్థము** : ఏషః = ఈ సూర్యుడు, రశ్మిభావనః = కాంతిచేతనే తెలిసికొనబడు వాడు; తేజస్వీ = ఎక్కువ ప్రకాశమానమైనవాడు (కనుకనే); సర్వదేవాత్మకః = అందరు దేవతలయొక్క ఆత్మరూపమైనవాడు (అందరి దేవతల ఆత్మల యందును మెరయువాడు); హి = కదా; ఏషః = ఈ సూర్యుడే; దేవాసురగణాన్ = దేవతల రాక్షసుల సమూహములను; లోకాన్ = సమస్తలోకములను; గభస్తిభిః = తన కిరణములచేతను; పాతి = రక్షించుచున్నాడు.

**తాత్పర్యము** : ఈ సూర్యుడు తన కాంతిచేతనే అందరిచేతను తెలిసికొన బడుచు ఆ కాంతిచేతనే అందరి ఆత్మలయొక్క రూపమును తనే అయి అందరి ఆత్మలను ప్రకాశింపజేయుచు సమస్త దేవాసురులను పదునాలుగు లోకములను తన కాంతిచేతనే రక్షించుచున్నాడు. ఈ శ్లోకమునందు సూర్యుని యొక్క ప్రాముఖ్యమును ఎక్కువగా ద్యోతకము చేయుటకు "ఏషః" అను పదము రెండుసార్లు ప్రయోగింపబడినది.

శ్లో. *ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివ స్స్కన్దః ప్రజాపతిః,*
*మహేన్ద్రో ధనదః కాలో యమ స్సోమో హ్యపామ్పతిః.* 8

**పదవిభాగమ్** : ఏషః, బ్రహ్మా, చ, విష్ణుః, చ, శివః, స్కన్దః, ప్రజాపతిః, మహేన్ద్రః, ధనదః, కాలః, యమః, సోమః, హి, అపామ్పతిః.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : ఏషః = ఈ సూర్యుడు; బ్రహ్మ = బ్రహ్మ (ప్రజలను వృద్ధి పొందించు వాడు); చ = మరియు; విష్ణుః = విష్ణువు (విశ్వమున వ్యాపించియుండువాడు); చ = మరియు; శివః = శివుడు (సజ్జన మనస్సులందుండువాడు) ఈ మూడు రూపములును సూర్యుడే అనుటచే సృష్టిస్థితిలయ కారణభూతుడు కూడా సూర్యుడే యగుచున్నాడు. ఈ రూపములే కాక సర్వదేవతారూపము కూడా ముందు చెప్పబోవు పదములతో సూర్యునియందే నిక్షిప్తమగుచున్నది; స్కన్దః = దేవతల సేనానాయకు డైన కుమారస్వామి (శత్రువులను శోషింపజేయువాడు); ప్రజాపతిః = బ్రహ్మ, ప్రజలకు ప్రభువు; మహేన్ద్రః = దేవేన్ద్రుడు (పరమ ఐశ్వర్యయుక్తుడు); ధనదః = కుబేరుడు (ధనమునిచ్చువాడు లేక రక్షించువాడు); కాలః = యముడు (ధర్మా ధర్మములను ఆయుస్సును లెక్కకట్టువాడు); యమః = యముడు (దండించు వాడు); సోమః = చంద్రుడు; అపామ్పతిః = సముద్రుడు; హి = (కూడా) కదా.

**తాత్పర్యము** : ఆయా దేవతలచేత అధిపతులచేత జరుపబడు కర్మ లన్నియును ఆయా రూపగుడు సూర్యుడు అని చెప్పుటచే సూర్యునిచేతనే జరుపబడుచున్నవని గ్రాహ్యము. కనుక సూర్యుడు సర్వాధిదేవుడు. ఆరాధ్య దైవము.

శ్లో. పితరోవసవస్సాధ్యాహ్యశ్వినౌ మరుతో మనుః,
వాయుర్వహ్నిః ప్రజాప్రాణ ఋతుకర్తా ప్రభాకరః. 9

**పదవిభాగమ్** : పితరః, వసవః, సాధ్యాః, హి, అశ్వినౌ, మరుతః, మనుః, వాయుః, వహ్నిః, ప్రజాప్రాణః, ఋతుకర్తా, ప్రభాకరః.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : పితరః = పితృదేవతారూపమైనవాడు; వసవః = అష్టవసువుల రూపమైన వాడు (అష్టవసువులు: ఆపుఁడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభానుడు అనువారు); సాధ్యాః = సాధ్యులనువారు దేవతలలో ఒక తెగ. ఆ రూపమైనవాడు; హి = కూడా; అశ్వినౌ = అశ్వినీ దేవతల రూపమైనవాడు. దేవతల వైద్యులు; మరుతః = జంఝూమారుతరూపమైనవాడు; మనుః = మనువుల రూపమైనవాడు (పదునాలుగురు మనువులు); వాయుః = హాయిగా వీచు గాలి రూపమైనవాడు; వహ్నిః = అగ్ని రూపమైనవాడు; ప్రజాప్రాణః = ప్రజలయందు ప్రాణరూపమున నున్నవాడు; ఋతుకర్తా = ఋతువులను చేయువాడు; ప్రభాకరః = కాంతికి ఆకరమైన యీ సూర్యుడు.

**తాత్పర్యము** : ఈ సూర్యభగవానుడే పైన చెప్పబడిన రూపములన్నియునై లోకములను నడిపెడువాడు.



శ్లో. ఆదిత్యస్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్,
సువర్ణసదృశో భానుర్హిరణ్యరేతా దివాకరః. 10

**పదవిభాగమ్** : ఆదిత్యః, సవితా, సూర్యః, ఖగః, పూషా, గభస్తిమాన్, సువర్ణ సదృశః, భానుః, హిరణ్యరేతాః, దివాకరః.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : ఆదిత్యః = సూర్యుడు (అదితి కొడుకు); సవితా = సూర్యుడు (నిద్ర పోయినవానిని ప్రేరేపించువాడు); సూర్యః = సూర్యుడు (వ్యాపారములయందు ప్రేరేపించువాడు); ఖగః = సూర్యుడు (ఆకాశమునందు నడచువాడు); పూషా = సూర్యుడు (జీవులను పోషించువాడు); గభస్తిమాన్ = కిరణములు గలవాడు (సూర్యుడు); సువర్ణసదృశః = సూర్యుడు (బంగారు వర్ణముతో సమమైన వర్ణము వాడు); భానుః = సూర్యుడు (ప్రకాశించువాడు); హిరణ్యరేతాః = సూర్యుడు (బంగారు రేతస్సు కలవాడు); దివాకరః = సూర్యుడు (రోజును చేయువాడు).

**తాత్పర్యము** : ఈ పై పేర్లతో లోకముచే పొగడబడుచున్నాడు.

శ్లో. హరిదశ్వస్సహస్రార్చిస్సప్తసప్తిర్మరీచిమాన్,
తిమిరోన్మథనశ్శమ్భుస్త్వష్టా మార్తాణ్డ అమ్శుమాన్. 11

**పదవిభాగమ్** : హరిదశ్వః, సహస్రార్చిః, సప్తసప్తిః, మరీచిమాన్, తిమిరో న్మథనః, శమ్భుః, త్వష్టా, మార్తాణ్డః, అమ్శుమాన్.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : [1]హరిదశ్వః = సూర్యుడు (పసుపుపచ్చని కాంతిగల గుఱ్ఱములు గలవాడు); సహస్రార్చిః = సూర్యుడు (వేయి కిరణములు కలవాడు); సప్తసప్తిః = సూర్యుడు (ఏడు గుఱ్ఱములచే లాగబడువాడు); మరీచిమాన్ = సూర్యుడు (కిరణ వంతుడు); తిమిరోన్మథనః = సూర్యుడు (చీకటిని పోగొట్టువాడు); శమ్భుః = సూర్యుడు (సుఖమును గలుగజేయువాడు); త్వష్టా = ద్వాదశాదిత్యులలో ఒకరు (ద్వాదశాదిత్యులు: ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు. ఈ పంద్రెండు పేర్లును సూర్యునియందును చెల్లును.); మార్తాణ్డః = సూర్యుడు (నశించిన బ్రహ్మాండమును బ్రతికించువాడు); అమ్శుమాన్ = సూర్యుడు (కిరణములు గలవాడు).

**తాత్పర్యము** : సుగమము.

[1] "హరిదశ్వః" అనగా - హరితవర్ణ అశ్వములు - ఆకుపచ్చని కాంతిగల - అనుట సమంజసము. పసుపు వర్ణము కాదు. (బా.ప.)

శ్లో. హిరణ్యగర్భశ్శిశిరస్తపనో భాస్కరో రవిః,
అగ్నిగర్భోఽదితేఃపుత్రశ్శఙ్ఖశ్శిశిరనాశనః. **12**

**పదవిభాగమ్** : హిరణ్యగర్భః, శిశిరః, తపనః, భాస్కరః, రవిః, అగ్నిగర్భః, దితౌః, పుత్రః, శఙ్ఖః, శిశిరనాశనః.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : హిరణ్యగర్భః = సూర్యుడు, బ్రహ్మకుగూడా ఈ పేరు గలదు. (గర్భమందు హిరణ్యము గలవాడు); శిశిరః = సూర్యుడు, కరుణార్ద్రహృదయుడు (ఆశ్రయించినవారికి చల్లని దయచూపువాడు); తపనః = సూర్యుడు (తపింప జేయువాడు); భాస్కరః = సూర్యుడు (కాంతిని కలుగజేయువాడు); రవిః = సూర్యుడు (నుతింపబడువాడు); అగ్నిగర్భః = సూర్యుడు (గర్భమందగ్ని కలవాడు); దితౌః పుత్రః = సూర్యుడు (అదితి పుత్రుడు గనుక దితి పుత్రుడు కూడా); శఙ్ఖః = సూర్యుడు నిధివిశేషము కలవాడు, (నవనిధులు - పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము,కుందము, నీలము, వరము.) ఇది గాక గణితములో ఒకట్ల స్థానము మొదలుకొని ఒక్కొక్క స్థానమును పెంచుకుంటూపోగా లక్షలు, కోట్లు, పదికోట్లు, వందకోట్లు, వెయ్యికోట్లు తరువాతి స్థానములు వరుసగా భూరి, మహాభూరి, శంఖము, మహాశంఖము, అర్బుదము, న్యర్బుదము, క్షోణి, మహాక్షోణి, అక్షౌహిణి అను లెఖ్ఖ ఆనుపూర్వికంగా వచ్చుచున్నది. శఙ్ఖః అనగా అంత సంఖ్యగల నామములు గలవాడు అని కూడా చెప్పుకొనవచ్చును; శిశిరనాశనః = చలిని నాశనము చేయువాడు - సూర్యుడు.

**తాత్పర్యము** : సుగమము.

శ్లో. వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః,
ఘనవృష్టిరపామ్ మిత్రో విన్ధ్యవీథీ ప్లవఙ్గమః. **13**

**పదవిభాగమ్** : వ్యోమనాథః, తమోభేదీ,ఋగ్యజుస్సామపారగః, ఘనవృష్టిః, అపామ్, మిత్రః, విన్ధ్యవీథీ, ప్లవంగమః.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : వ్యోమనాథః = సూర్యుడు (ఆకాశమునకు ప్రభువు); తమోభేదీ = సూర్యుడు (చీకటిని ఛేదించువాడు); ఋగ్యజుస్సామపారగః = సూర్యుడు (ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదముల అంత్యమును పొందినవాడు అనగా మూడు వేదముల పరిపూర్ణ పండితుడు); ఘనవృష్టిః = సూర్యుడు (మేఘములచే వర్షము కురిపించువాడు); అపామ్ = నీళ్లకు; మిత్రః = మిత్రుడు. సూర్యుడు; విన్ధ్యవీథీ = విన్ధ్యపర్వతము నడక చాలుగా గలవాడు సూర్యుడు; ప్లవఙ్గమః = సూర్యుడు (అనూరునిరథికుడు).

**తాత్పర్యము** : సుగమము.



శ్లో. ఆతపీ మణ్డలీ మృత్యుః పిఙ్గళస్సర్వతాపనః,
కవిర్విశ్వో మహాతేజారక్తస్సర్వభవోద్భవః. **14**

**పదవిభాగమ్** : ఆతపీ, మణ్డలీ, మృత్యుః, పిఙ్గళః, సర్వతాపనః, కవిః, విశ్వః, మహాతేజః, ఆరక్తః, సర్వభవోద్భవః.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : ఆతపీ = సూర్యుడు (ఎండను కలుగజేయువాడు); మణ్డలీ = సూర్యుడు (వర్తులాకారము కలవాడు); మృత్యుః, పిఙ్గళః = సూర్యుడు పరమ దయాళువుగనుక రాక్షసులకు వరమిచ్చునను సందియముచేత నింద్రాదులు విఘ్నదేవతలై నామాన్తరములతో సూర్యుని సమీపముల నుందురు. అందు యమాగ్ని రుద్రులు వరుసగా మాఠర (మృత్యు) పింగళ దండులనబడుదురు.); సర్వతాపనః = సూర్యుడు (సమస్త లోకములను తపింపజేయువాడు); కవిః = శుక్రగ్రహ ప్రీతిపాత్రుడు-సూర్యుడు; విశ్వః = సూర్యుడు (విశ్వదేవతలలో ఒకరు); మహాతేజః = సూర్యుడు (గొప్ప ప్రకాశము గలవాడు); ఆరక్తః = సూర్యుడు (అంతటను ఎర్రనైన వర్ణమువాడు); సర్వభవోద్భవః = సూర్యుడు (సమస్త సృష్టికి కారణమైనవాడు.)

**తాత్పర్యము** : సుగమము.

శ్లో. నక్షత్రగ్రహతారాణామధిపో విశ్వభావనః,
తేజసామతితేజస్వీ ద్వాదశాత్మన్నమోఽస్తు తే. **15**

**పదవిభాగమ్** : నక్షత్రగ్రహతారాణామ్, అధిపః, విశ్వభావనః, తేజసామ్, అతితేజస్వీ, ద్వాదశాత్మన్, నమః, అస్తు, తే.

**వాక్యక్రమము** : నక్షత్రగ్రహతారాణామ్, అధిపః, విశ్వభావనః, తేజసామ్, అతితేజస్వీ, ద్వాదశాత్మన్, తే, నమః, అస్తు.

**అర్థము** : నక్షత్రగ్రహతారాణామ్ = నక్షత్రములు, గ్రహములు, తారకలకు; అధిపః = ప్రభువు అయినవాడును; విశ్వభావనః = ప్రపంచమంతటిచేతను భావింప బడువాడును; తేజసామ్ = ప్రకాశము కలవారిలో; అతితేజస్వీ = ఎక్కువ ప్రకాశము కలవాడవును అయిన; ద్వాదశాత్మన్ = ద్వాదశాత్మలను ధరించిన ఓ సూర్యుడా; తే = నీకు; నమః = నమస్కారము; అస్తు = అగుగాక.

**తాత్పర్యము** : నక్షత్రగ్రహతారలకు ప్రభువైనవాడవును, ప్రపంచమంతటి చేతను ధ్యానము చేయబడువాడవును, తేజస్వంతులందరిలోనూ అతితేజస్వివి అయినవాడవును ద్వాదశా(పండ్రెండు)త్మరూపుడవైన ఓ సూర్యుడా! నీకు నమస్కరించుచున్నాను.

శ్లో. నమః పూర్వాయగిరయే పశ్చిమేగిరయే నమః,
జ్యోతిర్గణానామ్ పతయే దినాధిపతయే నమః. **16**

**పదవిభాగమ్** : నమః, పూర్వాయగిరయే, పశ్చిమేగిరయే, నమః, జ్యోతిర్గణానామ్, పతయే, దినాధిపతయే, నమః.

**వాక్యక్రమము** : పూర్వాయగిరయే నమః, పశ్చిమేగిరయే నమః, జ్యోతిర్గణా నామ్పతయే, దినాధిపతయే నమః.

**అర్థము** : పూర్వాయగిరయే = ఉదయపర్వతస్థుడవైన నీకు; నమః = నమస్కారము; పశ్చిమేగిరయే = అస్తపర్వతగతుడవైన నీకు; నమః = నమస్కారము; జ్యోతిర్గణానామ్పతయే = కాంతివంతమైన సమూహమునకు ప్రభువువైన నీకు; దినాధిపతయే = దినమునకు అధిపతివైన నీకు; నమః = నమస్కారము.

**తాత్పర్యము** : ఓ సూర్యుడా! నీ ఉదయరూపమునకు అస్తగతమౌ రూపమునకు జ్యోతిర్గణాధిపతివి, దినాధిపతివి అయిన నీకు నమస్కారము.

శ్లో. జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః,
నమోనమస్సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః. **17**

**పదవిభాగమ్** : జయాయ, జయభద్రాయ, హర్యశ్వాయ, నమః, నమః, నమః, నమః, సహస్రాంశో, ఆదిత్యాయ, నమః, నమః.

**వాక్యక్రమము** : హే సహస్రాంశో! నమః నమః, జయాయ, జయభద్రాయ హర్యశ్వాయ నమః నమః, ఆదిత్యాయ నమః నమః.

**అర్థము** : హే సహస్రాంశో = ఓ వేయి కిరణములు గలవాడా (తే = నీకు) నమః నమః = అనేక నమస్కారములు; జయాయ = జయస్వరూపమైనవాడవును; జయభద్రాయ = జయముచే భద్రమైనవాడవును; హర్యశ్వాయ = పచ్చని వర్ణము గల గుఱ్ఱములు గలవాడవును అయిన (తే = నీకు); నమః నమః = అనేక నమస్కారములు; ఆదిత్యాయ = అదితి పుత్రుడవైన (తే = నీకు) నమః నమః = అనేక నమస్కారములు.

**తాత్పర్యము** : జయస్వరూపుడు, జయముచే భద్రమైనవాడును గనుకనే అర్థులకు జయము కలుగచేయుట రూఢమై ఉన్నది. జయము నిశ్చయము. ‘‘నమో నమః’’ అని ద్విరుక్తముగా చెప్పుట నిష్ఠను తెలుపును.

శ్లో. నమ ఉగ్రాయ, వీరాయ సారఙ్గాయ నమోనమః,
నమః పద్మప్రబోధాయ మార్తాణ్డాయ నమోనమః. **18**



**పదవిభాగమ్** : నమః, ఉగ్రాయ, వీరాయ, సారఙ్గాయ, నమః, నమః, నమః, పద్మప్రబోధాయ, మార్తాణ్డాయ నమః, నమః.

**వాక్యక్రమము** : ఉగ్రాయ వీరాయ నమః, సారఙ్గాయ నమః నమః, పద్మ ప్రబోధాయ నమః, మార్తాణ్డాయ నమః, నమః.

**అర్థము** : ఉగ్రాయ = ఉగ్రస్వరూపుడవైన; వీరాయ = వీరస్వరూపుడవైన (తే = నీకు) నమః = నమస్కారము; సారఙ్గాయ = నానావర్ణములతో ప్రకాశించెడి (తే = నీకు) నమో నమః = అనేక నమస్కారములు; పద్మప్రబోధాయ = తామరలను ప్రబోధించె (తే = నీకు) నమః = నమస్కారము; మార్తాణ్డాయ = నశించిన బ్రహ్మాండమును ప్రళయమునందు బ్రతికించు స్వభావముకల ఓ సూర్యుడా (తే = నీకు) నమో నమః = అనేక నమస్కారములు.

**తాత్పర్యము** : సుగమము.

శ్లో. బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే,
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయవపుషే నమః. **19**

**పదవిభాగమ్** : బ్రహ్మేశానాచ్యుతేశాయ, సూర్యాయ, ఆదిత్యవర్చసే, భాస్వతే, సర్వభక్షాయ, రౌద్రాయవపుషే, నమః.

**వాక్యక్రమము** : యథాస్థితమ్ (ఉన్నది ఉన్నట్టుగనే).

**అర్థము** : బ్రహ్మేశానాచ్యుతేశాయ = బ్రహ్మ; ఈశానః = ఈశ్వరుడు; అచ్యుతః = విష్ణువు ఈ మూడు రూపములకును ప్రభువైనవాడవును; సూర్యాయ = సూర్య రూపమైనవాడవును; ఆదిత్యవర్చసే = ఆదిత్యకాంతి కలవాడవును; భాస్వతే = ప్రకాశమానమైనవాడవును; సర్వభక్షాయ = సర్వభక్షుడైన అగ్నిగర్భుడవును; రౌద్రాయవపుషే = రుద్రరూపుడవునునైన (తే = నీకు) నమః = నమస్కారము.

**తాత్పర్యము** : సుగమము.

శ్లో. తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే,
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః. **20**

**పదవిభాగమ్** : తమోఘ్నాయ, హిమఘ్నాయ, శతృఘ్నాయ, అమితాత్మనే, కృతఘ్నఘ్నాయ, దేవాయ, జ్యోతిషాం, పతయే, నమః.

**వాక్యక్రమము** : యథాస్థితమ్.

**అర్థము** : తమోఘ్నాయ = చీకటిని పోగొట్టువాడవును; హిమఘ్నాయ = మంచును పోగొట్టువాడవును; శతృఘ్నాయ = ఆ విధముగనే శత్రువులను నాశనము చేయువాడవును; అమితాత్మనే = అంతుతెలియని ఆత్మకలవాడవును; కృతఘ్న

ఘ్నాయ = కృతఘ్నులను నాశము చేయువాడవును; జ్యోతిషాంపతయే = నక్షత్రముల కధిపతివైనవాడవును; దేవాయ = అయిన దేవతాస్వరూపుడవైన (తే = నీకు) నమః = నమస్కారము.

**తాత్పర్యము** : సుగమము.

శ్లో. *తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే,*
*నమస్తమోఽభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే.* **21**

**పదవిభాగమ్** : తప్తచామీకరాభాయ, వహ్నయే, విశ్వకర్మణే, నమః, తమో అభినిఘ్నాయ, రుచయే, లోకసాక్షిణే.

**వాక్యక్రమము** : యథాస్థితమ్.

**అర్థము** : తప్తచామీకరాభాయ = పుటము పెట్టిన బంగారుచాయతో సమానమైన చాయ గలవాడవును; వహ్నయే = అగ్నిరూపమైనవాడవును; విశ్వకర్మణే = లోక మందలి అన్ని కర్మలకును ఆధారమైనవాడవును; తమోభినిఘ్నాయ = చీకటులను నాశనముచేయువాడవును; రుచయే = కాంతిమంతుడవును; లోకసాక్షిణే = లోకమందలి అన్ని కర్మలకును సాక్షీభూతుడవైనవాడవును అయిన; (తే = నీకు) నమః = నమస్కారము.

**తాత్పర్యము** : సుగమము.

శ్లో. *నాశయత్యేష వై భూతమ్ తదేవ సృజతి ప్రభుః,*
*పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః.* **22**

**పదవిభాగమ్** : నాశయతి, ఏషః, వై, భూతమ్, తత్, ఏవ, సృజతి, ప్రభుః, పాయతి, ఏషః, తపతి, ఏషః, వర్షతి, ఏషః, గభస్తిభిః.

**వాక్యక్రమము** : ఏషః ప్రభుః, భూతమ్, నాశయతి, వై, తదేవసృజతి, ఏషః ప్రభుః, గభస్తిభిః, పాయతి, ఏషః, ప్రభుఃతపతి, ఏషః ప్రభుః, వర్షతి.

**అర్థము** : ఏషః ప్రభుః = ఈ ప్రభువు; భూతమ్ = ప్రాణులను; నాశయతి = నాశము చేయుచున్నావు; వై = తిరిగి; తదేవ = ఆ ప్రాణులనే; సృజతి = సృజించు చున్నాడు (జననమరణ హేతుభూతుడగుచున్నాడు. త్రిమూర్త్యాత్మకుడు సూర్యుడే నని లోగడ చెప్పియుండుటచే సర్వకర్తృత్వము సూర్యుని యందే రూఢమగు చున్నది.); ఏషః ప్రభుః = ఈ ప్రభువు; గభస్తిభిః = కిరణములచేత; పాయతి = లోకమును రక్షించుచున్నాడు; ఏషః ప్రభుః = ఈ ప్రభువు; గభస్తిభిః = కిరణముల చేతనే; తపతి = తపింపజేయుచున్నాడు; ఏషః ప్రభుః = ఈ ప్రభువు; గభస్తిభిః = కిరణములచేతనే; వర్షతి = వర్షించుచున్నాడు.

**తాత్పర్యము** : సుగమము.



శ్లో. *ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః,*
*ఏషచైవాగ్నిహోత్రమ్ చ ఫలమ్ చైవాగ్నిహోత్రిణామ్.* **23**

**పదవిభాగమ్** : ఏషః, సుప్తేషు, జాగర్తి, భూతేషు, పరినిష్ఠితః, ఏషః, చ, ఏవ, అగ్నిహోత్రం, చ, ఫలమ్, చ, ఏవ, అగ్నిహోత్రిణామ్.

**వాక్యక్రమము** : ఏషః సుప్తేషు, జాగర్తి భూతేషు పరినిష్ఠితః, అగ్నిహోత్రమ్ చ ఏషః చ ఏవ, అగ్నిహోత్రిణామ్ ఫలమ్ చ ఏషః ఏవ.

**అర్థము** : ఏషః = ఈ ప్రభువు; సుప్తేషు = నిద్ర చెందినట్టియు; జాగర్తి = మేలుకొనియున్నట్టియు; భూతేషు = సమస్తభూతములయందును; పరినిష్ఠితః = అంతటను వ్యాపించియున్నవాడు; అగ్నిహోత్రమ్, చ = అగ్నిహోత్రమును; ఏషః చ ఏవ = ఈ ప్రభువే; అగ్నిహోత్రిణామ్ = నిత్యాగ్నిహోత్రులకు, నిత్యమును నిష్ఠతో అగ్నికార్యములు (హోమాదులు) చేయువారలకు; ఫలమ్ చ = ఫలసిద్ధియును; ఏషః ఏవ = ఈ ప్రభువే.

**తాత్పర్యము** : సుషుప్త్యవస్థలోను, జాగ్రదవస్థలోను ఉన్న సమస్త భూతముల యందును (ఏ యవస్థ యందున్నను) ఈ సూర్యుడు పరినిష్ఠితుడై (నిండినవాడై) యున్నాడు. అగ్నిహోత్రమును ఈ సూర్యుడే, అగ్నికార్యములు చేయువారలకు ఫలము నిచ్చువాడును ఈ సూర్యుడే.[1]

శ్లో. *వేదాశ్చక్రతవశ్చైవ క్రతూనామ్ ఫలమేవ చ,*
*యానికృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః.* **24**

**పదవిభాగమ్** : వేదాః, చ, క్రతవః, చ, ఏవ, క్రతూనామ్, ఫలమ్, ఏవ, చ, యాని, కృత్యాని, లోకేషు, సర్వః, ఏషః, రవిః, ప్రభుః.

**వాక్యక్రమము** : వేదాశ్చ, క్రతవశ్చ క్రతూనామ్ ఫలమేవ చ ఇత్యాది యానికృత్యాని లోకేషు సంతి తే సర్వః ఏషః రవిః ప్రభు ఏవః.

**అర్థము** : వేదాశ్చ = వేదములును; క్రతవః చ = యజ్ఞయాగాది క్రతువులును; క్రతూనామ్ ఫలమ్ ఏవ చ = యజ్ఞయాగాదులయొక్క ఫలమును; (ఇత్యాది = ఇవి మొదలైన); యానికృత్యాని = ఏఏ కార్యములు; లోకేషు = లోకములలో; (సంతి = ఉన్నవో); (తే) సర్వః = ఆ కార్యములన్నియు; ఏషః రవిః ప్రభుః ఏవ = ఈ సూర్యప్రభువే (అవినాభావ సంబంధము).

**తాత్పర్యము** : లోకములలో వేదములు యజ్ఞయాగాదిక్రతువులు మొదలైన సత్కార్యములు వానియొక్క ఫలమును మొదలైన సర్వములును ఈ సూర్య ప్రభువే. అవే ఈ ప్రభువు. ఈ ప్రభువే అవిగా వ్యవహరింపబడుచున్నవి.

[1] అగ్నిహోత్రఫలము ఈ దేవుడే.

*శ్లో. ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ,*
*కీర్తయన్పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ.* **25**

**పదవిభాగమ్** : ఏనమ్, ఆపత్సు, కృచ్ఛ్రేషు, కాన్తారేషు, భయేషు, చ, కీర్తయన్, పురుషః, కశ్చిత్, న, అవసీదతి, రాఘవ.

**వాక్యక్రమము** : హే రాఘవ! కశ్చిత్పురుషః ఆపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ ఏనమ్ కీర్తయన్ నావసీదతి.

**అర్థము** : హే రాఘవ = ఓ రామచంద్ర!; కశ్చిత్పురుషః = ఏ పురుషుడైనను; ఆపత్సు = ఆపదలయందును; కృచ్ఛ్రేషు = శరీరబాధలయందును; కాన్తారేషు = అడవులయందును (నిర్జన ప్రదేశముల నిస్సహాయస్థితి యందును); భయేషు చ = భయసమయములందును కూడా; ఏనమ్ = ఈ సూర్యప్రభువును (ఈ ఆదిత్య హృదయమును); కీర్తయన్ = స్తోత్రముచేయుచు (పఠించుచు); న అవసీదతి = దుఃఖములను చెందడు.

**తాత్పర్యము** : ఓ రామా! ఏ పురుషుడైనను ఎటువంటి కష్టసమయముల యందైనను ఈ సూర్యప్రభువును స్తోత్రము చేసినచో ఆపదలనుండి ఉద్ధరింప బడగలడు.

*శ్లో. పూజయస్వైనమేకాగ్రో దేవదేవమ్ జగత్పతిమ్,*
*ఏతత్త్రిగుణితమ్ జప్త్వా యుద్ధేషు విజయిష్యసి.* **26**

**పదవిభాగమ్** : పూజయస్వ, ఏనమ్, ఏకాగ్రః, దేవదేవమ్, జగత్పతిమ్, ఏతత్, త్రిగుణితమ్, జప్త్వా, యుద్ధేషు, విజయిష్యసి.

**వాక్యక్రమము** : హే రాఘవ. దేవదేవమ్ జగత్పతిమ్ ఏనమ్ ఏకాగ్రః సన్ పూజయస్వ. ఏతత్ త్రిగుణితమ్ జప్త్వా యుద్ధేషు విజయిష్యసి.

**అర్థము** : హే రాఘవ = ఓ రామా! (పూర్వశ్లోకమునుండి అధ్యాహారము); దేవదేవమ్ = దేవదేవుడైనట్టియు; జగత్పతిమ్ = లోకమునకు ప్రభువైనట్టియు; ఏనమ్ = ఈ సూర్యుని, ఏకాగ్రః (సన్) = స్థిరమనస్కుడవై; పూజయస్వ = పూజింపుము; ఏతత్ = ఈ ఆదిత్యహృదయమును; త్రిగుణితమ్ = మూడు ఆవృత్తులు[1] (మూడుసార్లు); జప్త్వా = జపించి; యుద్ధేషు = యుద్ధములయందు; విజయిష్యసి = జయమును పొందగలవు.

**తాత్పర్యము** : ఓ రామా! దేవదేవుడును లోకనాథుడును అయిన ఈ సూర్య భగవానుని నిష్ఠాగరిష్ఠుడవై పూజింపుము. ఈ ఆదిత్యహృదయమును మూడు మారులు[1] జపించినచో నీవు యుద్ధములలో జయమును పొందెదవు.

[1] త్రిగుణాత్మకముగ



*శ్లో. అస్మిన్క్షణే మహాబాహో రావణమ్ త్వమ్ వధిష్యసి,*
*ఏవముక్త్వా తతోఽగస్త్యో జగామ చ యథాగతమ్.* **27**

**పదవిభాగమ్** : అస్మిన్, క్షణే, మహాబాహో, రావణమ్, త్వమ్, వధిష్యసి, ఏవమ్, ఉక్త్వా, తదా, అగస్త్యః, జగామ, చ, యథా, ఆగతమ్.

**వాక్యక్రమము** : హే మహాబాహో! రాఘవ! అస్మిన్ క్షణేత్వమ్ రావణమ్ వధిష్యసి. ఏవమ్ ఉక్త్వా తదా అగస్త్యః యథాగతమ్ చ జగామ.

**అర్థము** : హే మహాబాహో! రాఘవ = ఓ దీర్ఘబాహుడవైన రామా!; అస్మిన్ క్షణే = ఈ క్షణమందే; త్వమ్ = నీవు; రావణమ్ = రావణుని; వధిష్యసి = వధించగలవు వధించెదవు; ఏవమ్ = ఈ విధముగా; ఉక్త్వా = చెప్పి; తదా = అప్పుడు; అగస్త్యః = అగస్త్యుడు; యథాగతమ్ = వచ్చిన విధముగా; జగామ చ = వెళ్లినవాడాయెను.

**తాత్పర్యము** : ఓ దీర్ఘబాహుడవైన రామా! నీవు ఈ క్షణముననే రావణుని వధించెదవు. అని ఈ విధముగా చెప్పి అప్పుడు అగస్త్యుడు వెళ్ళెను.

*శ్లో. ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా,*
*ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్.* **28**

**పదవిభాగమ్** : ఏతత్, శృత్వా, మహాతేజాః, నష్టశోకః, అభవత్, తదా. ధారయామాస, సుప్రీతః, రాఘవః, ప్రయతాత్మవాన్.

**వాక్యక్రమము** : ఏతత్, శృత్వా మహాతేజాః నష్టశోకః అభవత్ తదా సుప్రీతః రాఘవః ప్రయతాత్మవాన్ ధారయామాస.

**అర్థము** : ఏతత్ = దీనిని, శృత్వా = విని, మహాతేజాః = తేజస్వంతుడైన రాముడు; నష్టశోకః = దుఃఖముపోయినవాడు; అభవత్ = ఆయెను; తదా = అప్పుడు; సుప్రీతః = లెస్సగా ప్రీతుడైన; రాఘవః = రాముడు; ప్రయతాత్మవాన్ = ఆత్మసంయమనము చేసినవాడై; ధారయామాస = (నిష్ఠను) ధరించినవాడాయెను.

**తాత్పర్యము** : దీనిని విని తేజస్వంతుడైన రాముడు దుఃఖము పోయిన వాడయి, ఎక్కువగా ప్రీతి పొందినవాడై ఆత్మనియమమును చేసికొని నిష్ఠ యందున్నవాడాయెను. ఈ శ్లోకమునందు మహాతేజాః, సుప్రీతః, ప్రయ తాత్మవాన్ శబ్దప్రయోగములు చాల రసపుష్టికరములు.

*శ్లో. ఆదిత్యమ్ ప్రేక్ష్య జప్త్వా తు పరమ్ హర్షమవాప్తవాన్,*
*త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్.* **29**

**పదవిభాగమ్** : ఆదిత్యమ్ ప్రేక్ష్య, జప్త్వా, తు, పరమ్, హర్షమ్, అవాప్తవాన్, త్రిః, ఆచమ్య, శుచిః, భూత్వా, ధనుః, ఆదాయ, వీర్యవాన్.

**వాక్యక్రమము** : ఆదిత్యమ్ ప్రేక్ష్య జప్త్వాతు, పరమ్ హర్షమ్ అవాప్తవాన్. త్రిరాచమ్య శుచిర్భూత్వా వీర్యవాన్ ధనురాదాయ.

**అర్థము** : రాఘవః = (పూర్వశ్లోకమునుండి అధ్యాహారము) రాముడు; ఆదిత్యమ్ = సూర్యభగవానుని; ప్రేక్ష్య = చూచి; జప్త్వా, తు = జపించి, ధ్యానము చేసి కూడా; పరమ్ = ఎక్కువైన; హర్షం = సంతోషమును; అవాప్తవాన్ = పొందినవాడై; త్రిరాచమ్య = మూడుసార్లు ఆచమనము చేసి; శుచిర్భూత్వా = శుద్ధుడై (పరిశుద్ధమైన మనసుకలవాడై); వీర్యవాన్ = వీర్యవంతుడై; ధనుః = ధనస్సును; ఆదాయ = తీసుకొని (ముందు శ్లోకముతో అన్వయము).

**తాత్పర్యము** : అగస్త్యుని ఆదేశానుసారము శ్రీరాముడు సూర్యభగవానుని చూచి ధ్యానముతో జపించేటప్పటికి ఆయనకు ఎక్కడలేని ఉత్సాహము కలిగెను. అట్టి ఉత్సాహముతో మూడుసార్లు ఆచమించి పరిశుద్ధమై వినమ్రమైన మనసుతో వీర్యవంతుడై ధనస్సును చేత గ్రహించెను.

శ్లో. *రావణమ్ ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్,*
*సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్.* **30**

**పదవిభాగమ్** : రావణమ్, ప్రేక్ష్య, హృష్టాత్మా, యుద్ధాయ, సముపాగమత్, సర్వయత్నేన, మహతా, వధే, తస్య ధృతః, అభవత్.

**వాక్యక్రమము** : రావణమ్ ప్రేక్ష్య హృష్టాత్మా (సన్) యుద్ధాయ సముపాగమత్. మహతా తస్యవధే సర్వయత్నేన ధృతః అభవత్.

**అర్థము** : పై శ్లోకములో చెప్పిన విధముగా ధనస్సు చేతబట్టికొని రాముడు రావణమ్ = రావణుని; ప్రేక్ష్య = చూచి; హృష్టాత్మా (సన్) = సంతోషించినవాడై; యుద్ధాయ = యుద్ధము కొరకు; సముపాగమత్ = ఉద్యుక్తుడాయెను; మహతా = గొప్పదియైన; తస్యవధే = ఆ రావణుని వధించుటయందు; సర్వయత్నేన = అన్ని ప్రయత్నముల చేతను; ధృతః = ధరించినవాడు; అభవత్ = ఆయెను.

**తాత్పర్యము** : పై శ్లోకములో చెప్పిన విధముగా శ్రీరాముడు ధనుస్సు ధరించినవాడై రావణుని చూచి సంతుష్టాంతరంగుడై యుద్ధముకొరకు ఉద్యుక్తుడాయెను అన్ని ప్రయత్నములచేతను గొప్పదియైన వాని వధను సాధించవలెనని నిష్ఠాధిష్ఠితుడాయెను.



శ్లో. *అథ రవిరవదన్నిరీక్ష్య రామమ్ ముదితమనాః*
*పరమమ్ ప్రహృష్యమాణః,*
*నిశిచరపతిసంక్షయమ్ విదిత్వా సురగణమధ్యగతో వచస్త్వరేతి.* **31**

**పదవిభాగమ్** : అథ, రవిః, అవదత్, నిరీక్ష్య, రామమ్, ముదితమనాః, పరమమ్, ప్రహృష్యమాణః, నిశిచరపతిసమ్‌క్షయమ్, విదిత్వా, సురగణమధ్యగతః, వచస్త్వర, ఇతి.

**వాక్యక్రమము** : అథ, రవిః, ముదితమనాః, పరమమ్, ప్రహృష్యమాణః (సన్) రామమ్‌నిరీక్ష్య నిశిచరపతిసమ్‌క్షయమ్ విదిత్వా సురగణమధ్యగతః వచస్త్వర ఇతి అవదత్.

**అర్థము** : అథ = అటు తర్వాత; రవిః = సూర్యుడు; ముదితమనాః = సంతసము నొందిన మనసుగలవాడై; పరమమ్ = ఎక్కువగా; ప్రహృష్యమాణః = సంతసముతో ఉప్పొంగుచున్నవాడై; రామమ్ = రాముని; నిరీక్ష్య = చూచి, నిశిచరపతి సంక్షయమ్ = రాక్షసుడైన రావణ సంహారమును; విదిత్వా = తెలిసికొని; సురగణమధ్యగతః = దేవతాసమూహముల మధ్యను పొందినవాడవై; వచస్త్వర = ప్రకటింపుము; ఇతి = అని; అవదత్ = పలికెను.

**తాత్పర్యము** : శ్రీరాముడు రావణవధయందు నిష్ఠబూనినవాడైన తరువాత సూర్యుడు చాల సంతోషము నొందినవాడై ఉప్పొంగుచున్న మనసుతో రాముని చూచి "రాక్షసనాశమును చేసి దేవతలందరి మధ్యను ప్రకటింపుము" అని దీవించెను.

*ఇతి శ్రీమద్రామాయణే యుద్ధకాణ్డే*
*ఆదిత్యహృదయమ్ నామ సప్తోత్తర శతతమః సర్గః*
*సార్థతాత్పర్యమ్ సంపూర్ణమ్.*
*శ్రీ కృష్ణార్పణమస్తు*

# శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే
# యుద్ధకాణ్డే
# బ్రహ్మకృత రామస్తవమ్ నామ
# వింశత్యుత్తర శతతమః సర్గః
# సార్థతాత్పర్యమ్

శ్లో. *తతో హి దుర్మనా రామశ్శ్రుత్వైవం వదతామ్ గిరః,*
*దధ్యౌ ముహూర్తమ్ ధర్మాత్మా బాష్పవ్యాకులలోచనః.* 1

**పదవిభాగమ్** : తతః, హి, దుర్మనా, రామః, శృత్వా, ఏవ, వదతామ్, గిరః, దధ్యౌ, ముహూర్తమ్, ధర్మాత్మా, బాష్పవ్యాకులలోచనః.

**వాక్యక్రమము** : తతః రామః వదతామ్ గిరః శృత్వా ఏవ ధర్మాత్మా బాష్పవ్యాకుల లోచనః ముహూర్తమ్ దుర్మనా దధ్యౌహి.

**అర్థము** : తతః = తరువాత (సీతాదేవి అగ్నిప్రవేశము చేయగా చూచి వానర రాక్షసులు హాహాకారములు చేయ ప్రారంభించిన తరవాత); రామః = రాముడు; వదతామ్ = చెప్పుచున్న; గిరః = మాటలను (చేయుచున్న హాహాకారములను); శృత్వా = వినియును; ఏవ = కూడా; ధర్మాత్మా = ధర్మనిష్ఠితమైన మనసు గలిగిన రాముడు (మనసును ధర్మనిష్ఠితమైన దానినిగానే ఉంచి); బాష్పేవ్యాకులలోచనః = నీటిబిందువులతో వ్యాకులమైన కళ్లుగలవాడై; ముహూర్తమ్ = క్షణమాత్రమును; దుర్మనా = కష్టము కలిగిన మనస్సుతో, దధ్యౌహి = ధరించెను గదా!

**తాత్పర్యము** : పూర్వసర్గయందు సీతాదేవి అగ్నిప్రవేశము చేయగా, సమస్త జనులు, మూడులోకములు దేవగంధర్వదానవులు చూచి భయత్రస్తులై నట్లును రాక్షసులయొక్క వానరుల యొక్క హాహాకారధ్వని అంతటను వ్యాపించి సంక్షోభము కావించెననియును వర్ణింపబడినది. అప్పుడు రాముడు అట్టి హాహాకారమును వినియుకూడా ఆ కార్యమును వారించక ధర్మమునందే నిష్ఠితమైన మనసు కలవాడై కన్నీటితోనిండిన లోచనములతో క్షణమాత్రము



కష్టము కలిగిన మనసును ధరించినవాడాయెను. అనగా మానవ సహజ లక్షణములైన ప్రేమానురాగములను వాత్సల్యతాగుణమును మనసుకు క్షణమాత్రము తెచ్చికొనినవాడాయెను.

శ్లో. *తతో వైశ్రవణో రాజా యమశ్చామిత్రకర్శనః,*
*సహస్రాక్షోమహేన్ద్రశ్చ వరుణశ్చ పరన్తపః.* 2

**పదవిభాగమ్** : తతః, వైశ్రవణః, రాజా, యమః, చ, అమిత్రకర్శనః, సహస్రాక్షః, మహేన్ద్రః, చ, వరుణః, చ, పరన్తపః.

**వాక్యక్రమము** : తతః, రాజావైశ్రవణః, అమిత్రకర్శనః యమశ్చ సహస్రాక్షః మహేన్ద్రః చ, పరన్తపః.

**అర్థము** : తతః = ఆ సమయమందు; రాజా = యక్షులకు రాజైన; వైశ్రవణ = కుబేరుడును; అమిత్రకర్శనః = శత్రువులను కృశింపజేయువాడు అయిన; యమః = యముడును; సహస్రాక్షః = వేయికన్నులు గలిగిన; మహేన్ద్రః చ = దేవేంద్రుడును; పరన్తపః = సూర్యదేవుడును.

**తాత్పర్యము** : పై శ్లోకములో చెప్పిన విధముగా రాముడున్న సమయ మందు కుబేరుడు, యముడు, దేవేంద్రుడు, సూర్యదేవుడు మొదలుగా గలవారు మరికొందరు దేవతలు వచ్చిరని ముందు శ్లోకముతో అన్వయము.

శ్లో. *షడర్ధనయనశ్శ్రీమాన్మహాదేవో వృషధ్వజః,*
*కర్తా సర్వస్యలోకస్య బ్రహ్మా బ్రహ్మవిదామ్ వరః.* 3

**పదవిభాగమ్** : షడర్ధనయనః, శ్రీమాన్, మహాదేవః, వృషధ్వజః, కర్తా, సర్వస్య, లోకస్య, బ్రహ్మా, బ్రహ్మవిదామ్ వరః.

**వాక్యక్రమము** : మహాదేవః వృషధ్వజః శ్రీమాన్, షడర్ధనయనః, సర్వస్య, లోకస్య, కర్తా బ్రహ్మవిదామ్ వరః, బ్రహ్మా.

**అర్థము** : మహాదేవః = మహాదేవుడును; వృషధ్వజః = వృషభధ్వజుడును (ఆం బోతుజండావాడు); శ్రీమాన్ = విభూతివంతుడును; షడర్ధనయనః = త్రిలోచనుడైన ఈశ్వరుడును; సర్వస్య = సమస్తమైన; లోకస్య = లోకములయొక్క; కర్తా = సృష్టించువాడును (సృష్టికర్తయును); బ్రహ్మవిదామ్ = పరబ్రహ్మస్వరూపమును తెలిసికొనినవారలలో; వరః = శ్రేష్ఠుడును అయిన; బ్రహ్మా = బ్రహ్మదేవుడును.

**తాత్పర్యము** : మహాదేవుడు, వృషభధ్వజుడు, త్రినేత్రుడును, అయిన ఈశ్వరుడును, సృష్టికర్తయు బ్రహ్మవిదులలో శ్రేష్ఠుడును అయిన బ్రహ్మ దేవుడును.

శ్లో. ఏతే సర్వే సమాగమ్య విమానైస్సూర్యసన్నిభైః,
ఆగమ్య నగరీమ్ లఙ్కామభిజగ్ముశ్చ రాఘవమ్. 4

**పదవిభాగమ్** : ఏతే, సర్వే, సమాగమ్య, విమానైః, సూర్యసన్నిభైః, ఆగమ్య, నగరీమ్, లఙ్కామ్, అభిజగ్ముః, చ, రాఘవమ్.

**వాక్యక్రమము** : ఏతే సర్వే సూర్యసన్నిభైః విమానైః సమాగమ్య లఙ్కామ్ నగరీమ్ ఆగమ్య రాఘవమ్ అభిజగ్ముః చ.

**అర్థము** : ఏతే సర్వే = ఈ పైనచెప్పినవారందరును; సూర్యసన్నిభైః = సూర్య కాంతితో సమానమైన కాంతిగల; విమానైః = విమానములచేత; సమాగమ్య = కూడుకొన్నవారై; లఙ్కామ్‌నగరీమ్ = లంకాపట్టణమును; ఆగమ్య = చేరి; రాఘవమ్ = రామచంద్రుని; అభిజగ్ముః చ = ఎదురు చనిరి కూడను.

**తాత్పర్యము** : పైన చెప్పిన బ్రహ్మ మొదలైనవారందరును కాంతివంతము లైన విమానములమీద కూడుకొని లంకాపట్టణమునకు వచ్చి రాముని ఎదుటికి వెళ్లిరి.

శ్లో. తతస్సహస్తాభరణాన్ ప్రగృహ్య విపులాన్భుజాన్,
అబ్రువంస్త్రిదశశ్రేష్ఠాః ప్రాఞ్జలిమ్ రాఘవమ్ స్థితమ్. 5

**పదవిభాగమ్** : తతః, సహస్తాభరణాన్, ప్రగృహ్య, విపులాన్, భుజాన్, అబ్రువన్, త్రిదశశ్రేష్ఠాః, ప్రాఞ్జలిమ్, రాఘవమ్, స్థితమ్.

**వాక్యక్రమము** : తతః సహస్తాభరణాన్ విపులాన్, భుజాన్ ప్రగృహ్య త్రిదశ శ్రేష్ఠాః ప్రాఞ్జలిమ్ స్థితమ్ రాఘవమ్ (ప్రతి) అబ్రువన్.

**అర్థము** : తతః = రాముని ఎట్టఎదుటకు వెళ్లిన తరువాత; [1]సహస్తాభరణాన్ = హస్తాభరణములతో (మురుగులుగాని భుజకీర్తులుగాని) కూడుకొనినవారు; విపులాన్ = విశాలమైన, భుజాన్ = భుజములను; ప్రగృహ్య = పట్టుకొని, త్రిదశశ్రేష్ఠాః = దేవతాశ్రేష్ఠులైన బ్రహ్మ మొదలైనవారు; ప్రాఞ్జలిమ్ = అంజలి ఘటించి (దోసిలిపట్టి రెండు చేతులు జోడించి); స్థితమ్ = ఉన్నట్టి; రాఘవమ్ (ప్రతి) = రాముని గూర్చి; అబ్రువన్ = పలికిరి.

**తాత్పర్యము** : బ్రహ్మ మొదలైనవారు రాముని ఎదుటకు వచ్చి తమ రెండు చేతులతోను రాముని యొక్క [1]హస్తాభరణములతోనుండిన విశాలమైన

[1] "సహస్తాభరణాన్" పదము దేవతలకు మాత్రమే అన్వయము. సీతారామలక్ష్మణులు వనవాస ప్రారంభ పూర్వము తమ సర్వస్వము - దానము చేసిరి. వనవాసమునకు అనుమతినిచ్చు సమయమున దశరథుడు సీతాదేవికి "వనవాసం హి సంఖ్యాయా వాసాంస్యాభరణాని చ భర్తారమనుగచ్ఛన్తీ సీతాయాశ్వశురోదదౌ" వస్త్రములు, ఆభరణములు ఒసంగెను. వారు ముష్వురు నారచీరలు ధరించిరి.



భుజములను పట్టుకొనగా (ప్రేమతోను స్నేహముతోను మందలింపు కొరకై) వెంటనే రాముడు వినమ్రుడై దోసిలి ఒగ్గినవాడాయెను. అట్లు ప్రాంజలియైన రామునిగూర్చి దేవతలు చెప్పుచున్నారు. "ఏమి పనయ్యా! రామా! ఇది" అని అనుటకు ఆదరముతోను, ప్రేమతోను స్నేహమునను వారించుటకు భుజములను పట్టుకొనగా రాముడు వినమ్రుడైనాడు.

శ్లో. కర్తా సర్వస్యలోకస్య శ్రేష్ఠో జ్ఞానవతామ్ వరః,
ఉపేక్షసే కథమ్ సీతామ్ పతన్తీమ్ హవ్యవాహనే. 6

**పదవిభాగమ్** : కర్తా, సర్వస్య, లోకస్య, శ్రేష్ఠః, జ్ఞానవతామ్ వరః, ఉపేక్షసే, కథమ్, సీతామ్, పతన్తీమ్, హవ్యవాహనే.

**వాక్యక్రమము** : సర్వస్యలోకస్యకర్తా శ్రేష్ఠః జ్ఞానవతామ్ వరః హవ్యవాహనే పతన్తీమ్ సీతామ్, కథమ్ ఉపేక్షసే.

**అర్థము** : సర్వస్యలోకస్య = సమస్త లోకములయొక్క; కర్తా = సృష్టికర్తవును; శ్రేష్ఠః = ఉత్తమగుణములచేత మిక్కిలి కొనియాడబడదగినవాడవును; జ్ఞానవతామ్ = జ్ఞానవంతులైనవారిలో; వరః = శ్రేష్ఠుడవును, అయిన ఓ రామా!; హవ్యవాహనే = అగ్నియందు; పతన్తీమ్ = పడుచున్న; సీతామ్ = సీతాదేవిని; కథమ్ = ఏ విధముగా; ఉపేక్షసే = ఉపేక్షించెదవు?

**తాత్పర్యము** : సృష్టికర్తయైన బ్రహ్మను సృష్టించిన పరబ్రహ్మ స్వరూపుడవు; మిక్కిలిగా కొనియాడదగిన గుణములు కలవాడవు. జ్ఞానవంతులందరి యందును శ్రేష్ఠుడవు అట్టి నీవు ఓ రామా! అగ్నిలోనున్న సీత విషయమున ఎందుకు ఉపేక్షించుచుంటివయ్యా! అని బ్రహ్మాదులు రాముని ప్రశ్నించిరి.

శ్లో. కథమ్ దేవగణశ్రేష్ఠమాత్మానమ్ నావబుధ్యసే,
ఋతుధామావసుః పూర్వమ్ వసూనామ్ త్వమ్ ప్రజాపతిః. 7

**పదవిభాగమ్** : కథమ్, దేవగణశ్రేష్ఠమ్; ఆత్మానమ్, న, అవబుధ్యసే, [1]ఋతుధామా, వసుః, పూర్వమ్, వసూనామ్ త్వమ్, ప్రజాపతిః.

**వాక్యక్రమము** : దేవగణశ్రేష్ఠమ్ ఆత్మానమ్ కథమ్ న, అవబుధ్యసే. పూర్వమ్, త్వమ్ [1]ఋతుధామావసుః వసూనామ్ ప్రజాపతిః.

**అర్థము** : (త్వమ్ = నీవు); దేవగణశ్రేష్ఠమ్ = దేవతాగణములలో శ్రేష్ఠునిగా; ఆత్మానమ్ = తనను (నిన్ను); కథమ్ న అవబుధ్యసే = ఎందుకు తెలిసికొనలేక యున్నావు; త్వమ్ = నీవు; పూర్వమ్ = పూర్వము; [1]ఋతుధామా = కాంతికి

[1] "ఋతధామాః" అను పాఠాంతరము కలదు. ఋతము అనగా "నిత్యసత్యము - శాశ్వత సత్యము" అను అర్థము చెప్పుదురు.

స్థానమైనట్టి, వసుః = వసువువు; వసూనామ్ = వసువులలో (అష్టవసువులు); ప్రజాపతిః = బ్రహ్మవు.

**తాత్పర్యము** : దేవతలందరిలోను శ్రేష్ఠమైనవానినిగాని నిన్ను నీవు ఎందుకు తెలిసికొనవు? పూర్వము నీవు కాంతికి స్థానమైనట్టి వసువువు. వసువులలో బ్రహ్మవు.

శ్లో. త్రయాణామ్ త్వమ్ హి లోకానామాదికర్తా స్వయమ్ప్రభుః,
రుద్రాణామష్టమోరుద్రస్సాధ్యానామసి పఞ్చమః. 8

**పదవిభాగమ్** : త్రయాణామ్, త్వమ్, హి, లోకానామ్, ఆదికర్తా, స్వయమ్ ప్రభుః, రుద్రాణామ్, అష్టమః, రుద్రః, సాధ్యానామ్, అసి, పఞ్చమః.

**వాక్యక్రమము** : త్రయాణామ్ లోకానామ్ ఆదికర్తాత్వమేహి స్వయమ్ప్రభుః రుద్రాణామ్ అష్టమః రుద్రః సాధ్యానామ్ పఞ్చమః అసి.

**అర్థము** : త్రయాణామ్ = మూడైనటువంటి; లోకానామ్ = లోకములకు (మూడు లోకములకు); ఆదికర్తా = తొలికర్తవు; త్వమ్ హి = నీవే కదా!; త్వమ్ = నీవు. స్వయమ్ప్రభుః హి = స్వయమ్ ప్రభువువు గదా!; రుద్రాణామ్ = రుద్రులలో (ఏకాదశరుద్రులు - అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు, అనువారలు); అష్టమరుద్రః = ఎనిమిదవ రుద్రుడవు; సాధ్యానామ్ = సాధ్యులలో (సాధ్యులు 12 మంది - మనుడు, హనుమంతుడు, విష్ణువు, ధర్ముడు, నారాయణుడు మొదలగువారు); పఞ్చమః = ఐదవవాడవును; అసి = అగుచున్నావు.

**తాత్పర్యము** : మూడులోకములకు ఆదికర్తవు నీవే గదా! నీవు స్వయం ప్రభువువు గదా. రుద్రులలో ఎనిమిదవవాడవును, సాధ్యులలో అయిదవ వాడవును నీవే అగుచున్నావు. (ఆదిత్యులు 12, విశ్వులు 10, వసువులు 8, తుషితులు 36గురు, భాస్వరులు 64గురు, అనిలులు 49గురు, మహా రాజికులు 220 మంది, సాధ్యులు 12, రుద్రులు 11 అనువారలు గణదేవతలు)

శ్లో. అశ్వినౌ చాపి తే కర్ణౌ చన్ద్రసూర్యౌ చ చక్షుషీ,
అన్తే చాదౌ చ లోకానామ్ దృశ్యసే త్వమ్ పరమ్తప. 9

**పదవిభాగమ్** : అశ్వినౌ, చ, అపి, తే, కర్ణౌ, చన్ద్రసూర్యౌ, చ, చక్షుషీ, అన్తే, చ, ఆదౌ, చ, లోకానామ్, దృశ్యసే, త్వమ్, పరమ్తప.

**వాక్యక్రమము** : హే పరమ్తప! అశ్వినౌ చ అపి తే కర్ణౌ చన్ద్ర సూర్యౌ చ చక్షుషీ. లోకానామ్ అన్తే చ ఆదౌ చ త్వమ్ దృశ్యసే.



**అర్థము** : హే పరమ్తప = ఎక్కువగా (మిక్కిలి) తపింపజేయగల ప్రకాశము గల ఓ పరబ్రహ్మ స్వరూపమా! రామా!; అశ్వినౌ = అశ్వినీదేవతలు అను దేవవైద్యులు (వీరు కవలలు); తే = నీయొక్క; కర్ణౌ చ = చెవులు గదా!; అపి = మరియు; చన్ద్ర సూర్యౌ = చంద్రసూర్యులు; తే = నీయొక్క; చక్షుషీ చ = కండ్లు గదా! లోకానామ్ = లోకములయొక్క; అన్తే చ = అంత్యమందును (ప్రళయకాలమందు); ఆదౌ చ = పుట్టుక యందును (పునస్సృష్టియందును); త్వమ్ = నీవు; దృశ్యసే = చూడబడుదువు. (నీవు శాశ్వతుడవు)

**తాత్పర్యము** : ఓ పరంతపా! దివ్య పరంజ్యోతివై వెలుగొందు ఓ రామా! నీవు విరాట్స్వరూపుడవు. అశ్వినీదేవతలు నీ కర్ణములు. సూర్యచంద్రులు నీ చక్షువులు. లోకముల అంత్యమందును ఆదియందును కూడ నీవు పరంజ్యోతివై పరబ్రహ్మవై చూడబడుదువు. నీవు శాశ్వతుడవు.

శ్లో. ఉపేక్షసే చ వైదేహీమ్ మానుషః ప్రాకృతోయథా,
ఇత్యుక్తో లోకపాలైస్తై స్వామీలోకస్య రాఘవః. 10

**పదవిభాగమ్** : ఉపేక్షసే, చ, వైదేహీమ్, మానుషః, ప్రాకృతః, యథా, ఇతి, ఉక్తః, లోకపాలైః, తైః, స్వామీ, లోకస్య, రాఘవః.

**వాక్యక్రమము** : ప్రాకృతః మానుషః యథా తథా వైదేహీమ్ ఉపేక్షసే చ ఇతి తైః లోకపాలకైః లోకస్య స్వామీ రాఘవః ఉక్తః.

**అర్థము** : ప్రాకృతః = ప్రకృతిసంబంధియైన; మానుషః = (సామాన్యమైన) మానవుడు; యథా = ఏ విధమో; తథా = ఆ విధముగా; వైదేహీమ్ = విదేహరాజ పుత్రిని, సీతను; ఉపేక్షసే చ = ఉపేక్షించుచుంటివి సుమా!; ఇతి = అని; తైః = ఆ; లోకపాలకైః = లోకపాలురచేత; లోకస్యస్వామీ = లోకప్రభువైన; రాఘవః = రామచంద్రుడు; ఉక్తః = చెప్పబడగా.

**తాత్పర్యము** : పై శ్లోకములో చెప్పబడిన విధముగా ఆదివిష్ణువు అవతార రూపుడవైన ఓ రామా! నీవు సీతాదేవిని అగ్నిలో విడిచి ప్రాకృత పురుషుని వలె ఉపేక్షించుచుంటివా అని ఆ లోకపాలురైన బ్రహేంద్రాదులచే లోక ప్రభువైన రామచంద్రుడు అడుగబడగా (అని ముందు శ్లోకముతో అన్వయము).

శ్లో. అబ్రవీత్త్రిదశశ్రేష్ఠాన్రామో ధర్మభృతామ్ వరః,
నాహమ్ విష్ణుర్నరుద్రశ్చ న దేవా న పితామహః. 11

**పదవిభాగమ్** : అబ్రవీత్, త్రిదశశ్రేష్ఠాన్, రామః, ధర్మభృతామ్, వరః, న, అహమ్, విష్ణు, న, రుద్రః, చ, న, దేవాః, న, పితామహః.

**వాక్యక్రమము** : ధర్మభృతామ్ వరః రామః త్రిదశశ్రేష్ఠాన్, అబ్రవీత్, అహమ్ న విష్ణుః రుద్రశ్చ న, దేవాః న, పితామహః న.

**అర్థము** : ధర్మభృతామ్ = ధర్మమును భరించినవారిలో; వరః = శ్రేష్ఠుడైన; రామః = రామచంద్రుడు; త్రిదశశ్రేష్ఠాన్ = దేవతాశ్రేష్ఠులైన రుద్రేంద్రాదుల గూర్చి; అబ్రవీత్ = (ఈ క్రింది వాక్యములు) పలికెను; అహమ్ = నేను; విష్ణుః = విష్ణువును, న = కాదు; రుద్రః చ = రుద్రుడను, న = కాను; దేవాః = దేవతలును, న = కాను; పితామహః = బ్రహ్మను, న = కాను.

**తాత్పర్యము** : వెనుక శ్లోకములో లోకపాలురచేత ఆ విధముగా చెప్పబడగా ధర్మభృత్తులైనవారిలో శ్రేష్ఠుడైన రాముడు వారినిగూర్చి ఈ క్రింది విధముగా ప్రతిజవాబు పలికెను ''మీరు నన్ను ఎంతో గొప్పగా ఆదివిష్ణువునని, పరబ్రహ్మనని ఏమేమో చెప్పుచున్నారు గదా. నేను అవి ఏవియును కాను. విష్ణువును కాను, రుద్రుడను కాను, దేవగణములవానిని గాను, బ్రహ్మను గాను, మరి ఎవరవయ్యా అను ప్రశ్నకు ముందు శ్లోకముతో అన్వయము.

శ్లో. *ఆత్మానమ్ మానుషమ్ మన్యే రామమ్ దశరథాత్మజమ్,*
*యోహమ్ యస్య యతశ్చాహమ్ భగవాన్తద్బ్రవీతు మేః.* **12**

**పదవిభాగమ్** : ఆత్మానామ్, మానుషమ్, మన్యే, రామమ్, దశరథాత్మజమ్, యః, అహమ్, యస్య, యతః, చ, అహమ్, భగవాన్, తత్, బ్రవీతు, మే.

**వాక్యక్రమము** : దశరథాత్మజమ్ రామమ్ మానుషమ్ ఆత్మానమ్ మన్యే హే భగవాన్ అహమ్ యః యస్య యతః చ అహమ్ తత్ మే బ్రవీతు.

**అర్థము** : దశరథాత్మజమ్ = దశరథుని కొమారుడై; రామమ్ = రామునిగా; మానుషమ్ = మనుష్యమాత్రునిగా మాత్రమే; ఆత్మానమ్ = నన్ను నేను (తనను); మన్యే = ఎంచుకొనుచున్నాను; హే భగవాన్ = ఓ పూజ్యుడా; అహమ్ = నేను; యః = ఎవడనో; యస్య = ఎవనివానినో; యతః చ అహమ్ = ఎక్కడనుండి వచ్చినవాడనో; తత్ = ఆ విషయమునంతయు; మే = నా కొరకు; బ్రవీతు = చెప్పబడుగాక.

**తాత్పర్యము** : దశరథుని కొమారుడైన రామునిగాను మనుష్యమాత్రునిగాను మాత్రమే నన్ను నేను ఎంచుకొనుచున్నాను, అంతే! అది కాదందురేని అని నిశ్చితమైన బుద్ధితో ఓ పూజ్యులారా! నేను ఎవడనో ఎవనివానినో ఎక్కడనుండి వచ్చినవాడనో ఆ విషయమంతయును నాకు చెప్పవలసినదిగా మిమ్మును కోరుచున్నాను గనుక అది సర్వమును నా కొరకు చెప్పబడుగాక.



శ్లో. ఇతి బ్రువాణమ్ కాకుత్స్థమ్ బ్రహ్మా బ్రహ్మవిదామ్ వరః,
అబ్రవీచ్ఛృణు మే రామ సత్యమ్ సత్యపరాక్రమ. **13**

**పదవిభాగమ్** : ఇతి, బ్రువాణమ్, కాకుత్స్థమ్, బ్రహ్మా, బ్రహ్మవిదామ్, వరః, అబ్రవీత్, శృణు, మే, రామ, సత్యమ్, సత్యపరాక్రమ.

**వాక్యక్రమము** : ఇతి బ్రువాణమ్ కాకుత్స్థమ్ బ్రహ్మవిదామ్ వరః బ్రహ్మా అబ్రవీత్. సత్యపరాక్రమ, రామ మే సత్యమ్ (వచనమ్) శృణు.

**అర్థము** : ఇతి = అని; బ్రువాణమ్ = అడుగుచున్న; కాకుత్స్థమ్ = రామ చంద్రుని; బ్రహ్మవిదామ్ వరః = బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైన; బ్రహ్మా = బ్రహ్మదేవుడు; అబ్రవీత్ = పలికెను; హే సత్యపరాక్రమ = సత్యమందు ఉనికియే పరాక్రమము (సత్యసుస్థిరత్వమే పరాక్రమము)గా గలవాడా!; రామ = రామచంద్రా!; మే = నాయొక్క; సత్యమ్ (వచనమ్) = సత్యపథమందు వర్తించుమాటను; శృణు = వినుము.

**తాత్పర్యము** : ఈ వెనుక నాలుగు (౧౦, ౧౧, ౧౨, ౧౩) శ్లోకములలోను ఉత్కృష్టమైన రసభావనను చొప్పించినాడు కవి వాల్మీకి. సీతాదేవియొక్క సచ్ఛీలమును లోకమునకు చూపుటకు ఆమెను అగ్నిప్రవేశము చేయించినాడు రాముడు. అంతేగాని ఆమెశీలమును శంకించి మాత్రము కాదు. ఆమె అగ్నిప్రవేశము చేయగనే వానరరాక్షసుల హాహాకారములు చెలరేగటమే కాక అష్టదిక్పాలురు సర్వదేవతలు సూర్యసన్నిభములైన విమానములమీద వచ్చి రాముని పరబ్రహ్మస్వరూపునిగానూ ఆదికారణునిగాను స్తోత్రముచేసి ''ప్రాకృతమానవునివలె సీతను అగ్నిలో ప్రవేశింపజేసి ఉపేక్ష చేయుచుంటి వేమయ్యా'' అని ''లోకస్యస్వామి''యైన రాఘవుని అడిగినారు. ''లోకస్య స్వామి'' అను ప్రయోగము రసవంతము. తను లోకస్యస్వామియైనను ''ధర్మ భృతామ్ వరుడు''గానే శ్రీరాముడు ''మీరు చెప్పినవాళ్లను ఎవరను నేను కాను ధర్మముకొరకే నేను చేయుచున్నాను'' అని తన ధర్మప్రీతిని వెల్లడించు కొనుటలో వారి పొగడ్త మీద వ్యతిరేకభావమును కూడా ద్యోతకము చేస్తూ నేను దశరథపుత్రుడనైన రాముడను మానవమాత్రుడను మాత్రమేనని తన ధర్మనిశ్చిత బుద్ధిని స్పష్టముగా వారలకు వెల్లడించినాడు. దానిమీద వారలు ఆలోచించుకొనవలసి వచ్చినది. అందరిలోను ముఖ్యుడైనవాడు ''బ్రహ్మ విదామ్ వరుడు'' అయిన బ్రహ్మదేవుడు ముందుకువచ్చి రాముని మనో భావమును గ్రహించి సత్యపరాక్రమ! రామ! నాయొక్క సత్యమైన వాక్యమును వినుము అని ప్రారంభించి రాముని విరాట్స్వరూపమును వినుతించినాడు.

బ్రహ్మదేవునకు ఆ సమయమందు రామావతార విశిష్ఠత్వ అవసరమును రామునకు తెలియ చేయవలసి వచ్చినది. ఈ శ్లోకములలోను 10వ శ్లోకము లోను "లోకస్యస్వామీ" అనునది, 11వ శ్లోకములో "రామోధర్మభృతామ్ వరః" అను ప్రయోగము, 12వ శ్లోకములో "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్" అనునది, 13వ శ్లోకములో "బ్రహ్మవిదామ్ వరః బ్రహ్మ" "సత్యపరాక్రమ రామ" "మే సత్యం (వచనం) శృణు" అన్న శబ్ద ప్రయోగములు మిక్కిలి రసగర్భములు సందర్భమునకు తగిన సాభిప్రాయ ప్రయోగములునై యొప్పుచున్నవి. వాల్మీకి కవిత రసమయమైనది.

శ్లో॥ *భవాన్నారాయణోదేవశ్శ్రీమాన్శ్చక్రాయుధోవిభుః,*
*ఏకశృఙ్గోవరాహస్త్వమ్ భూతభవ్యసపత్నజిత్.* **14**

**పదవిభాగమ్** : భవాన్, నారాయణః, దేవః, శ్రీమాన్, చక్రాయుధః, విభుః, ఏకశృఙ్గః, వరాహః, త్వమ్, భూతభవ్యసపత్నజిత్.

**వాక్యక్రమము** : భవాన్ నారాయణః దేవః శ్రీమాన్ చక్రాయుధః విభుః, త్వమ్ ఏకశృంగః వరాహః, భూతభవ్యసపత్నజిత్.

**అర్థము** : భవాన్ = నీవు; నారాయణః దేవః = ఆదిదేవుడైన నారాయణ దేవుడవు; శ్రీమాన్ = శోభావంతుడవు; చక్రాయుధః = చక్రాయుధమును ధరించినవాడవు; విభుః = లోకప్రభువువు; త్వమ్ = నీవు; ఏకశృఙ్గఃవరాహః = ఆదివరాహమూర్తివి; భూతభవ్యసపత్నజిత్ = గడచిన గడవబోవు శత్రువులను జయించు స్వభావము కలవాడవు. భూతభవ్యశత్రుజయశీలివి.

**తాత్పర్యము** : నీవు ఆదినారాయణదేవుడవు. మిక్కిలి ప్రకాశము గలవాడవు. చక్రాయుధమును ధరించిన లోకప్రభువువు. గడచిపోయిన గడవనున్న సమస్త శత్రువులను జయించు స్వభావముకల ఏకశృంగుడైన ఆదివరాహమూర్తివి. సమస్తలోకాధారుడవైన ప్రభువువు.

శ్లో॥ *అక్షరమ్ బ్రహ్మసత్యమ్ చ మధ్యే చాన్తే చ రాఘవ,*
*లోకానామ్ త్వమ్ పరోధర్మో విష్వక్సేనశ్చతుర్భుజః.* **15**

**పదవిభాగమ్** : అక్షరమ్, బ్రహ్మ, సత్యమ్, చ, మధ్యే, చ, అన్తే, చ, రాఘవ, లోకానామ్, త్వమ్, పరః, ధర్మః, విష్వక్సేనః, చతుర్భుజః.

**వాక్యక్రమము** : హే రాఘవ! బ్రహ్మ అక్షరమ్. అన్తే చ మధ్యేన సత్యమ్ చ. త్వమ్ చతుర్భుజః విష్వక్సేనః లోకానామ్ పరః ధర్మః.



**అర్థము** : హే రాఘవ = ఓ రామచంద్రా; బ్రహ్మ = పరబ్రహ్మ; అక్షరమ్ = నాశములేనిది. నాశముకానిది; అన్తేచ = చివరికాలమందును; మధ్యేచ = మధ్య కాలమందును; సత్యమ్చ = సత్యమైనదియై శాశ్వతమైనది. నీవే ఆ పరబ్రహ్మ స్వరూపము; త్వమ్ = నీవు; చతుర్భుజః = చతుర్భుజుడవైన (నాలుగుచేతులు గల); విష్వక్సేనః = ఆ ఆదివిష్ణువువు; లోకానామ్ = లోకములకు; పరః = శ్రేష్ఠాతి శ్రేష్ఠమైన; ధర్మః = ధర్మమవు. లోకములకు నిన్ను బొందుటయే ఉత్తమోత్తమగతి.

**తాత్పర్యము** : ఓ రామచంద్రా! పరబ్రహ్మ నాశములేనిది ఎల్లకాలముల యందును సత్యమై శాశ్వతమైనది. నీవే అట్టి సత్యమై శాశ్వతమై చతుర్భుజుడ వైన ఆదివిష్ణువువు. లోకములకు శ్రేష్ఠమై ఆచరించి అనుష్ఠించి సిద్ధి పొందింప చేసికొనదగు ధర్మమువు. నీవు తప్ప లోకములకు వేరుగతిలేదు. నిన్ను సేవించుటయే చేరుటయే ఉత్తమోత్తమమైన ధర్మము. పోతనగారు ఆంధ్ర భాగవతములో యశోద శ్రీకృష్ణుని రోలుకు కట్టివేయు ఘట్టమును వర్ణించుచు ఈ క్రింది పద్యములో ఈ సత్యమునే అతివిశదమైన మాటలలో చెప్పి యున్నాడు. పద్యమునుదహరించుట అప్రస్తుతము కాదు.

కం॥ వెలి, లోను, మొదలు, దుది, నడు
ములు, లేక జగంబు తుదియు, మొదలున్, నడుమున్,
వెలియును, లోనగు, నీశ్వరు
నలవడునే కట్టఁబ్రణతురాల్ గాకున్నన్.

శ్లో॥ *శార్ఙ్గధన్వా హృషీకేశః పురుషః పురుషోత్తమః,*
*అజితః ఖడ్గధృద్విష్ణుః కృష్ణశ్చైవ బృహద్బలః.* **16**

**పదవిభాగమ్** : శార్ఙ్గధన్వా, హృషీకేశః, పురుషః, పురుషోత్తమః, అజితః, ఖడ్గధృత్, విష్ణుః, కృష్ణః, చ, ఏవ, బృహద్బలః.

**వాక్యక్రమము** : సుగమము.

**అర్థము** : శార్ఙ్గధన్వా = శార్ఙ్గమను విల్లును ధరించువాడు (విష్ణువు); హృషీకేశః = హృషీకః = ఇంద్రియములకు ఈశః = ప్రభువు, ఇంద్రియనిగ్రహము కలవాడు (విష్ణువు); పురుషః = పురమనగా శరీరమందుండువాడు పురుషుడు (విష్ణువు); పురుషోత్తమః = పురుషులయందుత్తముడు పురుషోత్తముడు (విష్ణువు); అజితః = జయించుటకు వీలుకానివాడు అజితుడు (విష్ణువు); ఖడ్గధృత్ = ఖడ్గమును ధరించువాడు, విష్ణుని ఖడ్గము పేరు నందకము; విష్ణుః = విశ్వమును వ్యాపించి యుండువాడు (విష్ణువు); కృష్ణః చ ఏవ = దైత్యులను నలిపివేయువాడు కృష్ణుడు కూడను; బృహద్బలః = యుద్ధములో వృద్ధినిచెందు బలముకలవాడు బృహద్బలుడు (విష్ణువు).

**తాత్పర్యము** : ఈ పైన చెప్పబడిన పేర్లు అన్నిటిచేతను ఒప్పుచున్నవాడవై శాశ్వతుడవైనవాడవు నీవే.

శ్లో. సేనానీర్గ్రామణీశ్చ త్వమ్ బుద్ధిస్సత్త్వమ్ క్షమా దమః,
ప్రభవశ్చాప్యయశ్చ త్వముపేన్ద్రో మధుసూదనః. **17**

**పదవిభాగమ్** : సేనానీః, గ్రామణీః, చ, త్వమ్, బుద్ధిః, సత్త్వమ్, క్షమా, దమః, ప్రభవః, చ, అపి, అయః, చ త్వమ్, ఉపేన్ద్రః, మధుసూదనః.

**వాక్యక్రమము** : త్వమ్‌సేనానీః గ్రామణీః చ, త్వమ్ బుద్ధిః, సత్త్వమ్ క్షమాదమః, త్వమ్ ప్రభవః చ అపి అయః చ, త్వమ్ ఉపేంద్రః మధుసూదనః.

**అర్థము** : త్వమ్ = నీవు; సేనానీః = దేవసైన్యమును నడపిన కుమారస్వామివిని; గ్రామణీః చ = అతిశ్రేష్ఠుడవును; త్వమ్ = నీవు; బుద్ధిః = మానవునకు ఆలోచననిచ్చే బుద్ధివి; త్వమ్ = నీవు; సత్త్వమ్ = ప్రాణులు ధరించుచున్న ప్రాణమవు; త్వమ్ = నీవు; క్షమా = బహిరిన్ద్రియ నిగ్రహము క్షమ (ఓర్పు) (శమము) అది నీవే; త్వమ్ = నీవు; దమః = అన్తరిన్ద్రియ నిగ్రహము దమః (శాంతి) నీవే; త్వమ్ = నీవు; ప్రభవః చ = పుట్టువాడవును నీవే; అపి = మరియు; త్వమ్ అయః చ = శుభావహమైన కర్మలను చేయించువాడవును నీవు; త్వమ్ ఉపేంద్రః = ఇంద్రలోకముకంటె పైలోకమున నుండువాడు (విష్ణువు); త్వమ్ మధుసూదనః = మధువను రాక్షసుని సంహరించినవాడవు నీవే.

**తాత్పర్యము** : నీవు కుమారస్వామివి, శ్రేష్ఠుడవు, ఉపేంద్రుడవు, మధుసూదనుడవు. మానవునకు ఆలోచననిచ్చు బుద్ధివి, మానవుడు ధరించు ప్రాణమవు, క్షమదమములు నీవు. ప్రతిజీవిగాను పుట్టువాడవు నీవు శుభ కర్మలను చేయించువాడవు నీవు. సర్వకర్తవు నీవే. శ్రీమన్మధ్వాచార్యుల వారి సిద్ధాంతము కూడ నిదియే-సర్వప్రాణులలోను ప్రేరకుడు సర్వోత్తముడైన విష్ణువే. సర్వాంతర్యామియు విష్ణువే.

శ్లో. ఇన్ద్రకర్మా మహేన్ద్రస్త్వమ్ పద్మనాభో రణాన్తకృత్,
శరణ్యమ్ శరణమ్ చ త్వామాహుర్దివ్యా మహర్షయః. **18**

**పదవిభాగమ్** : ఇన్ద్రకర్మా, మహేన్ద్రః, త్వమ్, పద్మనాభః, రణాన్తకృత్, శరణ్యమ్, శరణమ్, చ, త్వామ్, ఆహుః, దివ్యాః, మహర్షయః.

**వాక్యక్రమము** : త్వమ్ ఇన్ద్రకర్మా మహేన్ద్రః, త్వమ్ రణాన్తకృత్ పద్మనాభః దివ్యాః మహర్షయః శరణ్యమ్ శరణమ్ చ త్వామ్ ఆహుః.

**అర్థము** : త్వమ్ = నీవు; ఇన్ద్రకర్మా = ఐశ్వర్యమునభివృద్ధి చేయు కార్యమం దాసక్తుడైన; మహేన్ద్రః = దేవేంద్రుడవు; త్వమ్ = నీవు; రణాన్తకృత్ = జయించుట వలననే యుద్ధమును అంతముచేయునట్టి; పద్మనాభః = కమలనాభుడవైన ఆదివిష్ణువువు; దివ్యాః = దేవాంశసంభూతులై దివ్యజ్ఞానముగలిగిన; మహర్షయః = మహర్షులు; శరణ్యమ్ = శరణు పొందదగినవానినిగాను; శరణమ్ = శరణు రూపమైనవానినిగాను; త్వామ్ (ఏవ) = నిన్నే; ఆహుః = చెప్పిరి.



**తాత్పర్యము** : ఐశ్వర్యము నభివృద్ధిచేయు కార్యము కలిగిన దేవేంద్రుడవు నీవే. అనగా దేవేంద్ర కర్మ కూడా అతను నిమిత్తమాత్రుడే గాని నీదే. జయశీలివై రణాన్తకృత్తువైన ఆదివిష్ణువువు నీవే (ప్రస్తుత కార్యము (రావణవధ) నందు ఐశ్వర్యశాలివై జయశీలివై రావణవధ చేసి రణాన్తకృత్తువైతివి అని ధ్వని కూడ కలదు) శరణు పొందదగినవాడవు శరణురూపమైనవాడవును నీవే యని దివ్యజ్ఞానసంపన్నులైన మహర్షులు చెప్పుచు ఘోషించుచున్నారు.

శ్లో. సహస్రశృఙ్గో వేదాత్మా శతజిహ్వో మహర్షభః,
త్వమ్ త్రయాణామ్ హి లోకానామాదికర్తా స్వయమ్ప్రభుః. **19**

**పదవిభాగమ్** : సహస్రశృఙ్గః, వేదాత్మా, శతజిహ్వః, మహర్షభః, త్వమ్, త్రయాణామ్, హి, లోకానామ్ ఆదికర్తా [1]స్వయమ్ప్రభుః.

**వాక్యక్రమము** : సహస్రశృఙ్గః, వేదాత్మా, శతజిహ్వః, మహర్షభః, త్వమ్ త్రయాణామ్ లోకానామ్ ఆదికర్తాహి [1]స్వయమ్ప్రభుః.

**అర్థము** : సహస్రశృఙ్గః = సూర్యరూపమున ప్రకాశించెడు ఆదివిష్ణువువు; వేదాత్మా = వేదములయొక్క ఆత్మవు లేక వేదములే ఆత్మగాగలవాడవు; శతజిహ్వః = శతజిహ్వుడవు (బ్రహ్మవు); మహర్షభః = సర్వప్రభుడవు; త్వమ్ = నీవు; త్రయాణామ్ = మూడైన; లోకానామ్ = లోకములకు; ఆదికర్తాహి = తొలికర్తవు గదా!; [1]స్వయమ్ ప్రభుః = నీకు నీవే ప్రభువువు. నిన్నుమించిన ప్రభువులేడు.

**తాత్పర్యము** : నీవు సూర్యమండల మధ్యవర్తివైన పరబ్రహ్మవు. వేదములు అన్నీ నిన్నుగూర్చియే చెప్పును. సర్వప్రభుడవు, శతజిహ్వుడవు. లోకములకు ఆదికర్తవు. స్వయంప్రభువువు[1]. నిన్నుమించిన వెలుగులేదు.

శ్లో. సిద్ధానామపి సాధ్యానామాశ్రయశ్చాసి పూర్వజః,
త్వమ్ యజ్ఞస్త్వమ్ వషట్కారస్త్వమోమ్‌కారః పరమ్తపః. **20**

**పదవిభాగమ్** : సిద్ధానామ్, అపి, సాధ్యానామ్, ఆశ్రయః, చ, అసి, పూర్వజః, త్వమ్, యజ్ఞః, త్వమ్, వషట్కారః, త్వమ్, ఓమ్‌కారః, పరమ్తపః.

---

[1] నిన్ను మించిన ప్రభువు లేడు.

**వాక్యక్రమము** : త్వమ్ పూర్వజః సిద్ధానామ్, సాధ్యానామ్ అపి ఆశ్రయః అసి. చ. పరమ్తపః. త్వమ్ యజ్ఞః, త్వమ్ వషట్కారః, త్వమ్ ఓమ్కారః.

**అర్థము** : త్వమ్ = నీవు; పూర్వజః = ఆదిజన్ముడవై; సిద్ధానామ్ = సిద్ధులకును; సాధ్యానామ్ అపి చ = సాధ్యులకును కూడ (దేవయోని జాతులు); ఆశ్రయః = ఆశ్రయభూతుడవు; అసి = అగుచున్నావు; హే పరమ్తపః = ఓ మిక్కిలి ప్రకాశము గలవాడా! రాజా!; త్వమ్ = నీవు; యజ్ఞః = యజ్ఞమవు; త్వమ్ = నీవు; వషట్కారః = వషట్కారమవు. "శిఖాయై వషట్" వేదవాక్కు, అనగా అగ్నికి హవిస్సునిచ్చునపుడు ఉచ్చరించు పదము "వషట్". నీవు వషట్కారమువు అని చెప్పుటచే హవిస్సువు కూడా నీవే అని చెప్పుట; త్వమ్ = నీవు; ఓమ్కారః = ఓమ్కారమువు. సమస్త శబ్దములకును మూలమైన 'ఓమ్'కారమే నీవు.

**తాత్పర్యము** : నీవే ఆదిజన్ముడవు, శాశ్వతుడవును గనుక సిద్ధసాధ్యాది దేవయోనిజాతులకన్నిటికిని ఆశ్రయుడవు నీవే. యజ్ఞము నీవే. హవిస్సు నీవే. యజ్ఞముచేయునప్పుడు ఉచ్చరింపబడే ప్రథమ ఉచ్చారణశబ్దమైన ఓమ్కారము కూడా నీవే. సర్వము నీవే. అనగా కార్యకర్తృభోజ్యభోక్తృ రూపము లన్నియు నీవే. అట్టిది నీ విరాట్స్వరూపము.

శ్లో. *ప్రభవమ్ నిధనమ్ వా తే న విదుః కో భవానితి,*
*దృశ్యసే సర్వభూతేషు బ్రాహ్మణేషు చ గోషు చ.* **21**

**పదవిభాగమ్** : ప్రభవమ్, నిధనమ్, వా, తే, న, విదుః, కః, భవాన్, ఇతి, దృశ్యసే, సర్వభూతేషు, బ్రాహ్మణేషు, చ, గోషు, చ.

**వాక్యక్రమము** : తే ప్రభవమ్ నిధనమ్ వా భవాన్ కః ఇతి వా (కోపి) నవిదుః (త్వమ్) బ్రాహ్మణేషు, గోషు చ, సర్వభూతేషు చ దృశ్యసే.

**అర్థము** : తే = నీయొక్క; ప్రభవమ్ = పుట్టుకను, నిధనమ్వా = గిట్టుటనైనను; భవాన్ = నీవు; కః ఇతివా = ఎవడవో అని అయినను (కోపి = ఎవరును కూడ); న విదుః = తెలియలేరు. త్వమ్ = నీవు; బ్రాహ్మణేషు = బ్రాహ్మణులయందును; గోషు చ = గోవులయందును; సర్వభూతేషు చ = (అంతియే అననేల) సర్వ భూతములయందును; దృశ్యసే = చూడబడుదువు.

**తాత్పర్యము** : నీయొక్క పుట్టుకనుగాని గిట్టుటనుగాని నీవు ఎవరో నీ రూపమెట్టిదియో అని గాని ఎవరును తెలియలేరు. ఎవరికిని అందని పరమ పురుషుడవు. ఉత్తమస్థానగతుడవు. అయినను కోరువారు బ్రాహ్మణుల యందును, గోవులయందును వీరు మాత్రమే యననేల సర్వభూతముల యందును నిన్ను చూడగలరు.



శ్లో. *దిక్షు సర్వాసు గగనే పర్వతేషు వనేషు చ,*
*సహస్రచరణశ్శ్రీమాన్ శతశీర్షస్సహస్రదృక్.* **22**

**పదవిభాగమ్** : దిక్షు, సర్వాసు, గగనే, పర్వతేషు, వనేషు, చ, సహస్ర, చరణః , శ్రీమాన్, శతశీర్షః, సహస్రదృక్.

**వాక్యక్రమము** : సర్వాసుదిక్షుగగనే పర్వతేషు వనేషు చ సహస్రచరణః సహస్ర దృక్ శతశీర్షః శ్రీమాన్ త్వమేవ దృశ్యసే.

**అర్థము** : సర్వాసు = సమస్తమైన; దిక్షు = దిక్కులయందును; గగనే = ఆకాశము నందును; పర్వతేషు = పర్వతములయందును; వనేషు చ = అడవులయందును కూడా; సహస్రచరణః = వేయిపాదములు గలట్టియు; సహస్రదృక్ = వేయి నేత్రములు గలట్టియు; శ్రీమాన్ = శ్రీమంతుడవైన; త్వమేవ = నీవే; దృశ్యసే = చూడబడుదువు.

**తాత్పర్యము** : సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాద్,
స భూమిమ్ విశ్వతో వృత్వాత్య తిష్టద్దశాంగులమ్.

అని పురుషసూక్తములో చెప్పబడిన విషయమును (విరాట్రూపమును) ఈ శ్లోకమునుండి కొన్ని శ్లోకములలో చెప్పుచున్నాడు. ఆదివిష్ణువు విరాట్ స్వరూపము. సృష్టినంతటను ఆవరించియున్నది. ఆ విరాట్రూపుడే సృష్టి. సృష్టియే ఆ విరాట్రూపమునైనది.

శ్లో. *త్వమ్ ధారయసి భూతాని వసుధామ్ చ సపర్వతామ్,*
*అన్తే పృథివ్యాస్సలిలే దృశ్యసే త్వమ్ మహోరగః.* **23**

**పదవిభాగమ్** : త్వమ్, ధారయసి, భూతాని, వసుధామ్, చ, సపర్వతామ్, అన్తే పృథివ్యాః, సలిలే, దృశ్యసే, త్వమ్, మహోరగః.

**వాక్యక్రమము** : త్వమ్ భూతాని సపర్వతామ్ వసుధామ్ చ ధారయసి. పృథివ్యాః అన్తే సలిలే త్వమ్ మహోరగః దృశ్యసే.

**అర్థము** : త్వమ్ = నీవు; భూతాని = సమస్త భూతములను; స పర్వతామ్ = పర్వతములతో కూడిన; వసుధామ్ చ = భూమిని కూడా; ధారయసి = ధరించు చున్నావు. పృథివ్యాః = భూమియొక్క; అన్తే = అవసానకాలమందు అనగా ప్రళయ కాలమందు; సలిలే = భూమిని ముంచివేసిన ప్రళయసముద్రమందు; త్వమ్ = నీవు ఒక్కడవే; మహోరగః = సర్పరాజైన ఆదిశేషశాయివై; దృశ్యసే = వెలుగొందుచున్న వాడవై చూడబడుచున్నావు.

**తాత్పర్యము** : సమస్తభూతములను, పర్వతములతోగూడిన ఈ భూమిని నీవే ధరించుచున్నావు. అంత్యకాలమందు ప్రళయకాలందు ప్రళయజలధిలో శేషశాయివై వెలుగొందుచు శాశ్వతుడవై చూడబడుచున్నావు.

శ్లో. *త్రీన్లోకాన్ధారయన్రామ దేవగంధర్వదానవాన్,*
*అహమ్ తే హృదయమ్ రామ జిహ్వా దేవీసరస్వతీ.* **24**

**పదవిభాగమ్** : త్రీన్, లోకాన్, ధారయన్, రామ, దేవ, గంధర్వ దానవాన్, అహమ్, తే హృదయమ్, రామ, జిహ్వా, దేవీ, సరస్వతీ.

**వాక్యక్రమము** : హే రామ! త్రీన్‌లోకాన్ దేవగంధర్వ దానవాన్, ధారయన్. హేరామ! తే హృదయమ్ అహమ్. తే జిహ్వా దేవీ సరస్వతీ.

**అర్థము** : హేరామ = ఓ రామచంద్రా! త్రీన్‌లోకాన్ = మూడులోకములను, దేవగంధర్వదానవాన్ = దేవతలను, గంధర్వులను, దానవులను, ధారయన్ = ధరించుచు, అని పూర్వశ్లోకము పూర్వపాదముతో అన్వయము; హేరామ = ఓ రామచంద్రా!; తే హృదయమ్ = నీయొక్క హృదయమును; అహమ్ = సృష్టికర్తనైన నేను; తే జిహ్వా = నీ నాలుకమీదనున్న వాక్కు; దేవీసరస్వతీ = సరస్వతీదేవి.

**తాత్పర్యము** : మూడులోకములను దేవగంధర్వరాక్షసులను ధరించు చున్నవాడవు నీవు. నీ హృదయము నేనును, నీ వాక్కు సరస్వతీదేవియును అయి ఉన్నాము.

శ్లో. *దేవాగాత్రేషు రోమాణిస్థితాస్తే బ్రహ్మణః ప్రభో,*
*నిమేషస్తే భవేద్రాత్రిరున్మేషస్తే భవేద్దివా.* **25**

**పదవిభాగమ్** : దేవాః, గాత్రేషు, రోమాణి, స్థితాః, తే, బ్రహ్మణః, ప్రభో, నిమేషః , తే, భవేత్, రాత్రిః, ఉన్మేషః, తే, భవేత్, దివా.

**వాక్యక్రమము** : హే ప్రభో! బ్రహ్మణః తే గాత్రేషు దేవాః రోమాణిస్థితాః ప్రభో! తే నిమేషః రాత్రిః భవేత్. తే ఉన్మేషః దివా భవేత్.

**అర్థము** : హే ప్రభో! ఓ స్వయంప్రభువువైన రామచంద్రా; బ్రహ్మణః = పరబ్రహ్మ స్వరూపుడవైన; తే = నీయొక్క; గాత్రేషు = శరీరమునందు; దేవాః = దేవతలు; రోమాణి = రోమములుగా; స్థితాః = ఉన్నారు. హే ప్రభో = ఓ స్వయంప్రభువువైన రామచంద్ర; తే = నీయొక్క; నిమేషః = కనుమూత; రాత్రి = రాత్రి; భవేత్ = కాగలదు; తే = నీయొక్క; ఉన్మేషః = కనుతెఱప; దివా = పగలు; భవేత్ = కాగలదు.



**తాత్పర్యము** : ఓ ప్రభూ! పరబ్రహ్మస్వరూపుడవై విరాట్‌స్వరూపమైన నీ గాత్రమందు దేవతలు రోమములగుచున్నారు. నీ కనుమూత లోకములకు రాత్రియు నీవు మెలకువతో నుండుట పగలును అగుచున్నది.

శ్లో. *సమ్స్కారాస్తేఽభవన్వేదా న తదస్తిత్వయా వినా,*
*జగత్సర్వమ్ శరీరమ్ తే స్థైర్యమ్ తే వసుధాతలమ్.* **26**

**పదవిభాగమ్** : సమ్స్కారాః, తే, అభవత్, వేదాః, న, తత్, అస్తి, త్వయా, వినా, జగత్, సర్వమ్, శరీరమ్, తే స్థైర్యమ్, తే వసుధాతలమ్.

**వాక్యక్రమము** : తే సంస్కారాః వేదాః అభవత్, త్వయా వినా తత్‌నాస్తి. జగత్‌సర్వమ్ తే శరీరమ్. వసుధాతలమ్ తే స్థైర్యమ్.

**అర్థము** : తే = నీయొక్క; సమ్స్కారాః = సంకల్పములే, మనోవ్యాపారములే; వేదాః = వేదములు; అభవత్ = ఆయెను; త్వయా వినా = నిన్నువిడిచి, నీవు లేకుండా; తత్ = ఆ వేదములు; నాస్తి = లేవు (దేవుడులేని గుడిలేనట్లు); జగత్‌సర్వమ్ = ఈ ప్రపంచమంతయును; తే = నీకు; శరీరమ్ = శరీరము (ప్రపంచమంతయు నీ దేహము); వసుధాతలమ్ = భూమండలము అంతయు; తే స్థైర్యమ్ = నీకు స్థిరమైన స్థానము.

**తాత్పర్యము** : నీ సంకల్పములే వేదములు. నీవు లేనిచో వేదములే లేవు. ఈ ప్రపంచమంతయు నీ శరీరము. నీవు సర్వవ్యాపివి. ఈ భూమండలమే నీ స్థైర్యము. భూమండలమందంతటను నీవు సర్వవ్యాపివై యున్నావు.

శ్లో. *అగ్నిః కోపః ప్రసాదస్తే సోమశ్శ్రీవత్సలక్షణః,*
*త్వయాలోకాస్త్రయఃక్రాన్తాః పురాణే విక్రమైస్త్రిభిః.* **27**

**పదవిభాగమ్** : అగ్నిః, కోపః, ప్రసాదః, తే, సోమః, శ్రీవత్సలక్షణః, త్వయా, లోకాః, త్రయః, క్రాన్తాః, పురాణే విక్రమైః, త్రిభిః.

**వాక్యక్రమము** : శ్రీవత్సలక్షణః తే కోపః అగ్నిః తే ప్రసాదః సోమః పురాణే త్రిభిః విక్రమైః త్వయా త్రయః లోకాః క్రాన్తాః.

**అర్థము** : శ్రీవత్సలక్షణః = వక్షఃస్థలమందు మహాపురుష లక్షణమైన శ్రీవత్స మనెడు రోమావర్తలాంఛనము (గుర్తు) గలిగిన ఆదిపురుషా! ఓ రామా!; తే కోపః = నీయొక్క కోపమే; అగ్నిః = అగ్ని సుమా!; తే ప్రసాదః = నీ ప్రసాదమే (దయయే); సోమః = చంద్రుడు సుమా!; పురాణే = పూర్వకాలమందైన (బలిబంధనకాలమందు జరిగిన); త్రిభిఃవిక్రమైః = మూడైన విక్రమముల

చేత; బలిబంధనకాలమందు మూడు లోకములను మూడడుగులచే కప్పిన త్రివిక్రమావతారుడవైన; త్వయా = నీచేతను; త్రయఃలోకాః = మూడు లోకములును; క్రాన్తాః = ఆక్రమింపబడినవి గదా!

**తాత్పర్యము :** శ్రీవత్సలాఞ్ఛనా! ఓ రామా (శ్రీవత్సలాంఛన సంబోధముచేతనే ఆదిపురుష ద్యోతకము). నీ కోపమే అగ్ని సుమా! నీ ప్రసాదమే చంద్రుడు సుమా! పూర్వమందు జరిగిన త్రివిక్రమావతారము నీ రూపమే సుమా! శ్రీ వత్సలాంఛనుడవు, త్రివిక్రమావతారుడవు నీవే సుమా!

శ్లో. *మహేన్ద్రశ్చ కృతోరాజా బలిమ్ బద్ధ్వా మహాసురమ్,*
*సీతాలక్ష్మీర్భవాన్విష్ణుర్దేవః కృష్ణః ప్రజాపతిః.* **28**

**పదవిభాగమ్ :** మహేంద్రః, చ, కృతః, రాజా, బలిమ్, బద్ధ్వా, మహాసురమ్, సీతా, లక్ష్మీః, భవాన్, విష్ణుః, దేవః, కృష్ణః, ప్రజాపతిః.

**వాక్యక్రమము :** (త్వమ్) మహాసురమ్ బలిమ్ బద్ధ్వా రాజా, మహేంద్రః కృతః చ. సీతాలక్ష్మీః భవాన్ ప్రజాపతిః కృష్ణః దేవః విష్ణురేవ.

**అర్థము :** త్వమ్ = నీవు; మహాసురమ్ = రాక్షసరాజైన; బలిమ్ = బలిచక్రవర్తిని; బద్ధ్వా = కట్టివేసి; రాజా = రాజైన; మహేంద్రః = మహేంద్రునిగా; కృతః చ = చేసితివి గదా!; సీతా = ఈ సీతాదేవి; లక్ష్మీః = లక్ష్మీయవతారము గదా!; భవాన్ = నీవు; ప్రజాపతి = సృష్టికర్తవు; కృష్ణ దేవః = కృష్ణదేవుడవు; విష్ణుః = ఇన్ని యవతారము లెత్తిన ఆదివిష్ణువువు గదా!.

**తాత్పర్యము :** ఓ రామా! నీవు త్రివిక్రమావతారుడవై రాక్షసరాజైన బలిని కట్టి మహేంద్రుని రాజు చేసినావు. సృష్టికర్తవు. కృష్ణదేవుడవై లోకములను పాలించినావు. ఈ సీత లక్ష్మి యవతారము. నీవు రామావతారమెత్తిన ఆదివిష్ణువువు.

శ్లో. *వధార్థమ్ రావణస్యేహ ప్రవిష్టో మానుషీమ్ తనుమ్,*
*తదిదమ్ నః కృతమ్ కార్యమ్ త్వయా ధర్మభృతామ్ వరః.* **29**

**పదవిభాగమ్ :** వధార్థమ్, రావణస్య, ఇహ, ప్రవిష్టః, మానుషీమ్, తనుమ్. తత్, ఇదమ్, నః, కృతమ్, కార్యమ్ త్వయా, ధర్మభృతామ్ వరః.

**వాక్యక్రమము :** హే ధర్మభృతామ్ వర! (త్వమ్) ఇహ రావణస్య వధార్థమ్ మానుషీమ్ తనుమ్ ప్రవిష్టః. తదిదమ్ కార్యమ్ త్వయా నః కృతమ్.



**అర్థము :** హే ధర్మభృతామ్ వర = ఓ ధర్మభృత్తులలో శ్రేష్ఠుడా! రామ; త్వమ్ = నీవు; ఇహ = ఇహలోకములో, ఇక్కడ; రావణస్యవధార్థమ్ = రావణవధ కొరకు; మానుషీమ్ తనుమ్ = మనుష్యశరీరమును; ప్రవిష్టః = ప్రవేశించినవాడవైతివి; తదిదమ్ కార్యమ్ = ఆ యీ రావణవధ అను కార్యము; త్వయా = నీచేతను; నః = మాకొరకు; కృతమ్ = చేయబడినది.

**తాత్పర్యము :** ఓ ధర్మభృత్తులైనవారిలో శ్రేష్ఠుడా! రామా! ముందు శ్లోకములలో చెప్పబడిన విధముగా ఆదివిష్ణువైన నీవు త్రివిక్రమావతారుడవైన నీవు ఇప్పుడు రావణవధార్థము ఈ మనుష్యశరీరమున ప్రవేశించవలసి వచ్చినది. ఈ రావణవధ కార్యము నీచేతను మాకొరకు చేయబడినది. కనుక నీవు పరమాత్మవు. పరమాత్మవైన నీవు ఆదిలక్ష్మియైన సీతను ఇప్పుడు ఉపేక్షించుట తగదు. ఇక్కడ గొప్ప విశేషము ఏమంటే రామునకు నమ్మిక పుట్టించుటకు గాను బ్రహ్మదేవుడంతటివానికి ఇంతగా చెప్పవలసి వచ్చినది. నీవు త్రివిక్రమావతారుడవు లోకకర్తవు లోకభర్తవు సర్వము నీవే అని సోదాహరణలతో చెప్పిననే గాని దృఢపడనంతటి ధర్మనిష్ఠితమైన ధర్మభృత శ్రేష్ఠుడు రాముడు. ధర్మము నిరూపించుటకే సీతను అగ్నిప్రవేశము చేయించినాడు. రామునియొక్క ధర్మనిష్ఠితత్వము లోకమున చాటుటయే యీ స్తవ ఫలితము. ఆ దృఢచిత్తునియొక్క ధర్మనిష్ఠిత మనసునకు తృప్తిని కలిగించి సీతయొక్క సచ్ఛీలమును భవిష్యత్ లోకమున శాశ్వతము చేయుటకు బ్రహ్మాదులు దిగివచ్చి రామునకింత చెప్పవలసి వచ్చినది. రాముని ఒక్క ధర్మభృతామ్ వరత్వము, దృఢవ్రతత్వము, సత్యపరాక్రమత్వమును వేయి మడుంగులు ప్రకాశింపజేయుచున్నదీ బ్రహ్మకృత రామస్తవము.

శ్లో. *నిహతోరావణోరామప్రహృష్టో దివమాక్రమ,*
*అమోఘమ్ బలవీర్యమ్ తే అమోఘస్తే పరాక్రమః.* **30**

**పదవిభాగమ్ :** నిహతః, రావణః, రామ!, ప్రహృష్టః, దివమ్, ఆక్రమ, అమోఘమ్, బలవీర్యమ్, తే, అమోఘః, తే, పరాక్రమః.

**వాక్యక్రమము :** హేరామ! రావణః నిహతః ప్రహృష్టః సన్ దివమ్ ఆక్రమ తే బలవీర్యమ్ అమోఘమ్ తే పరాక్రమః అమోఘః.

**అర్థము :** హేరామ = ఓ రామచంద్రా!; రావణః = రావణుడు; నిహతః = చంపబడినాడు, చచ్చినాడు; ప్రహృష్టః సన్ = సంతోషించినవాడవై; దివమ్ = స్వర్గమును; ఆక్రమ = పొందుము; తే = నీయొక్క; బలవీర్యమ్ = బలవీర్యములు;

అమోఘమ్ = అమోఘములు; తే = నీయొక్క; పరాక్రమః = పరాక్రమము; అమోఘః = అమోఘము, వ్యర్థముకానిది.

**తాత్పర్యము** : ఓ రామచంద్రా! ఈ మానుషతనువును దేనికొరకై ధరించితివో అట్టి రావణవధ పూర్తియైనది. రావణుడు చంపబడినాడు. నీవు సంతోషించిన మనసుతో స్వర్గమును చేరుము. నీ బలవీర్యములు, నీ పరాక్రమము వ్యర్థము కానివి.

శ్లో. *అమోఘమ్ దర్శనమ్ రామ న చ మోఘస్తవస్తవ,*
*అమోఘాస్తే భవిష్యన్తి భక్తిమన్తశ్చయే నరాః.* **31**

**పదవిభాగమ్** : అమోఘమ్, దర్శనమ్, రామ, న, చ, మోఘ, తవ, స్తవః, అమోఘాః, తే, భవిష్యన్తి, భక్తిమన్తః, యే, నరాః.

**వాక్యక్రమము** : హే రామ! తవదర్శనమ్ అమోఘమ్, తవస్తవః చ నమోఘః. యే నరాః భక్తి మన్తః (సన్తి) తే అమోఘాః భవిష్యన్తి.

**అర్థము** : హే రామ! = ఓ రామచంద్రా; తవ = నీయొక్క; దర్శనమ్ = చూపు; ప్రత్యక్షము; అమోఘమ్ = వ్యర్థముకానిది; తవ = నీయొక్క; స్తవః చ = ఈ స్తోత్రమును; నమోఘః = వ్యర్థము కానిది. ఎక్కువ ఫలము నిచ్చునది. యేనరాః = ఏ మానవులు; భక్తిమన్తః (సన్తి) = భక్తి కలిగినవారు అగుచున్నారో; తే = వారు, ఆ మానవులు; అమోఘాః = వ్యర్థముకానివారలు (సార్థులు); భవిష్యన్తి = అగుచున్నారు.

**తాత్పర్యము** : ఓ రామా! నీ దర్శనము అమోఘము. ఈ నీ స్తవము అత్యంత ఫలదాయకము. ఏ మానవులు నీయందు భక్తి కలిగినవారగుచున్నారో వారు సార్థకజన్ములు కాగలరు సుమా!

శ్లో. *యే త్వామ్ దేవమ్ ధ్రువమ్ భక్తాః పురాణమ్ పురుషోత్తమమ్,*
*ప్రాప్నువన్తి సదా కామానిహలోకే పరత్ర చ.* **32**

**పదవిభాగమ్** : యే, త్వామ్, దేవమ్, ధ్రువమ్, భక్తాః, పురాణమ్, పురుషోత్తమమ్, ప్రాప్నువన్తి, సదా, కామాన్, ఇహలోకే, పరత్ర, చ.

**వాక్యక్రమము** : యే భక్తాః దేవమ్ ధ్రువమ్ పురాణమ్, పురుషోత్తమమ్ త్వామ్ భజంతితే ఇహలోకే పరత్ర చ సదా కామాన్ ప్రాప్నువన్తి.

**అర్థము** : యే భక్తాః = ఏ భక్తులు; దేవమ్ = ఆదిదేవుడవును; ధ్రువమ్ = శాశ్వతుడవును; పురాణమ్ = పురాణపురుషుడవును; పురుషోత్తమమ్ = పురుష శ్రేష్ఠుడవును అయిన; త్వామ్ = నిన్ను; భజంతే = సేవించుచున్నారో; తే = వారు; ఇహలోకే = ఈ లోకమునందును; పరత్రచ = పరలోకమునందును; సదా = ఎల్లప్పుడును; కామాన్ = కోరికలను; ప్రాప్నువన్తి = పొందుచున్నారు.



**తాత్పర్యము** : ఏ భక్తులు ఆదిదేవుడవు, శాశ్వతుడవు, పురాణపురుషుడవు, పురుషోత్తముడవును అయిన నిన్ను సేవించుచున్నారో వారు ఈ లోక మందును, పరలోకమందును కూడా ఎల్లప్పుడును సర్వ కోరికలను పొందు చున్నారు సుమా!

శ్లో. *ఇమమార్షమ్ స్తవమ్ నిత్యమితిహాసమ్ పురాతనమ్,*
*యే నరాః కీర్తయిష్యన్తి నాస్తి తేషామ్ పరాభవః.* **33**

**పదవిభాగమ్** : ఇమమ్, ఆర్షమ్, స్తవమ్, నిత్యమ్, ఇతిహాసమ్, పురాతనమ్, యే, నరాః, కీర్తయిష్యన్తి, న, అస్తి, తేషామ్, పరాభవః.

**వాక్యక్రమము** : ఆర్షమ్ నిత్యమ్ ఇతిహాసమ్ పురాతనమ్ ఇమమ్స్తవమ్ యే నరాః కీర్తయిష్యన్తి తేషామ్ పరాభవః నాస్తి.

**అర్థము** : ఆర్షమ్ = ఋషిప్రోక్తమైనది; నిత్యమ్ = శాశ్వతమైనది; ఇతిహాసమ్ = పారంపర్యోపదేశముకలది; పురాతనమ్ = పూర్వచరిత్ర బోధకమైనదియునైన; ఇమమ్ = ఈ; స్తవమ్ = రామస్తవమును; యే నరాః = ఏ మానవులు; కీర్తయిష్యన్తి = నిత్యపారాయణ చేయుచుందురో; తేషామ్ = వారికి; పరాభవః = పునర్జన్మ, తిరిగి పుట్టుక; నాస్తి = లేదు (ధ్రువమ్).

**తాత్పర్యము** : ఋషిప్రోక్తమై శాశ్వతమై పరంపరగా (వరుసగా ఉపదేశము కలదియై పూర్ణపురుషబోధకమైన యీ స్తవరాజమును ఏ నరుడు నిత్యమును భక్తితో కీర్తనచేయునో అట్టివానికి పునర్భవ దుఃఖము కలుగదు.

*ఇతి శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే యుద్ధకాణ్డే*
*బ్రహ్మకృత రామస్తవమ్‌నామ వింశత్యుత్తర శతతమస్సర్గః*
*సార్థతాత్పర్యమ్ సంపూర్ణమ్.*
*శ్రీ కృష్ణార్పణమస్తు*
*శ్రీరామచంద్రప్రీతివాత్సల్యోస్తు*

# శ్రీమద్రామాయణే యుద్ధకాండే
# ఏకవింశత్యుత్తర శతతమస్సర్గః
# వీతిహోత్రోత్థిత సీతాప్రదానమ్

శ్లో. ఏతచ్ఛ్రుత్వా శుభమ్ వాక్యమ్ పితామహసమీరితమ్,
అఙ్కేనాదాయ వైదేహీముత్పపాత విభావసుః. 1

**పదవిభాగమ్** : ఏతత్, శృత్వా, శుభమ్, వాక్యమ్, పితామహసమీరితమ్, అఙ్కేన, ఆదాయ, వైదేహీమ్, ఉత్పపాత, విభావసుః.

**వాక్యక్రమము** : పితామహ సమీరితమ్ ఏతత్ శుభమ్, వాక్యమ్, శృత్వా విభావసుః వైదేహీమ్ అఙ్కేన ఆదాయ ఉత్పపాత.

**అర్థము** : పితామహసమీరితమ్ = బ్రహ్మచేత చెప్పబడినటువంటి; ఏతత్ = ఈ; శుభమ్ = శుభకరమైన; వాక్యమ్ = వాక్యమును; శృత్వా = వినినవాడై; విభావసుః = అగ్నిహోత్రుడు; వైదేహీమ్ = విదేహరాజపుత్రియైన సీతాదేవిని; అఙ్కేన = రెండు చేతులయొక్క కౌగిలితో; ఆదాయ = తీసుకొనివచ్చి; ఉత్పపాత = ఎదుటపడెను.

**తాత్పర్యము** : బ్రహ్మ చెప్పిన ఈ శుభవాక్యములను విని అగ్నిహోత్రుడు సీతాదేవిని రెండు చేతుల కౌగిలితోనూ తీసుకొని వచ్చి (రాముని) ఎదుటపడెను.

శ్లో. సవిధూయ చితామ్ తామ్ తు వైదేహీమ్ హవ్యవాహనః,
ఉత్తస్థౌమూర్తిమానాశు గృహీత్వా జనకాత్మజామ్. 2

**పదవిభాగమ్** : సః, విధూయ, చితామ్, తామ్, తు, వైదేహీమ్, హవ్య వాహనః, ఉత్తస్థౌ, మూర్తిమాన్, ఆశు, గృహీత్వా, జనకాత్మజామ్.

**వాక్యక్రమము** : సః హవ్యవాహనః చితామ్ (గతామ్) తామ్ వైదేహీమ్ విధూయతు, ఆశుమూర్తిమాన్ జనకాత్మజామ్ గృహీత్వా ఉత్తస్థౌ.

**అర్థము** : సః హవ్యవాహనః = ఆ అగ్నిహోత్రుడు; చితామ్ = చితిని (గతామ్ = పొందినటువంటి); తామ్ = ఆ; వైదేహీమ్ = సీతాదేవిని; విధూయ, తు = తప్పించియును; ఆశు = శీఘ్రముగా; మూర్తిమాన్ = మూర్తిమంతుడై (ఆకారముతో



నిలచినవాడై); జనకాత్మజాన్ = సీతాదేవిని; గృహీత్వా = చేతులలోనికి తీసుకొని; ఉత్తస్థౌ = లేచి నిలిచినవాడాయెను.

**తాత్పర్యము** : అగ్నిహోత్రుడు చితిని ప్రవేశించిన సీతాదేవిని వెంటనే తప్పించుటయేగాక తత్క్షణమే శీఘ్రముగా స్వీయాకారముతో సీతాదేవిని రెండు చేతులలోనికిని తీసుకొని ఎత్తుగా లేచి నిలచినవాడాయెను.

శ్లో. తరుణాదిత్యసఙ్కాశమ్ తప్తకాఞ్చనభూషణమ్,
రక్తామ్బరధరామ్ బాలామ్ నీలకుఞ్చితమూర్ధజామ్. 3

**పదవిభాగమ్** : తరుణాదిత్యసఙ్కాశామ్, తప్తకాఞ్చనభూషణామ్, రక్తామ్బర ధరామ్, బాలామ్, నీలకుఞ్చితమూర్ధజామ్

**వాక్యక్రమము** : తరుణాదిత్యసఙ్కాశమ్ తప్తకాఞ్చనభూషణామ్ రక్తామ్బరధరామ్ నీలకుఞ్చితమూర్ధజామ్ బాలామ్.

**అర్థము** : తరుణాదిత్యసఙ్కాశమ్ = ఉదయించుచున్న సూర్యుని కాంతితో సమానమైన కాంతి గలిగినదియును; తప్తకాఞ్చనభూషణామ్ = బాగుగా కాచబడిన మేలిమివన్నె బంగారుమయమైన ఆభరణములు కలదియును; రక్తామ్బరధరామ్ = ఎర్రనిబట్ట ధరించినదియును (కాషాయాంబరము); నీలకుఞ్చితమూర్ధజామ్ = నీలిమము వక్రమునైన ముంగురులు కలదియును; బాలామ్ = బాల్యావస్థ యందున్నదియునైన సీతాదేవిని అను ముందు శ్లోకమునకు అన్వయము.

**తాత్పర్యము** : తరుణ సూర్యుని పగిది ప్రకాశమానమైనదియు మేలిమి బంగరు ఆభరణములు ధరించినదియును ఎర్రని బట్టను ధరించినదియును దట్టమై నల్లనివియై వంకరలుగానున్న ముంగురులు కలదియును బాలయునునైన సీతాదేవిని అను ముందు శ్లోకముతో నన్వయము.

శ్లో. అక్లిష్టమాల్యాభరణామ్ తథారూపామ్ మనస్వినీమ్,
దదౌ రామాయవైదేహీమఙ్కే కృత్వా విభావసుః. 4

**పదవిభాగమ్** : అక్లిష్టమాల్యాభరణామ్, తథారూపామ్, మనస్వినీమ్, దదౌ, రామాయ, వైదేహీమ్, అఙ్కే, కృత్వా, విభావసుః.

**వాక్యక్రమము** : అక్లిష్టమాల్యాభరణామ్, తథారూపామ్, మనస్వినీమ్ వైదేహీమ్ విభావసుః అఙ్కేకృత్వా రామాయ దదే.

**అర్థము** : అక్లిష్టమాల్యాభరణామ్ = (అగ్నిప్రవేశముచేత ఏ విధముగను) క్లేశము నొందని మైపూతలు ఆభరణములు గలదియును; తథారూపామ్ = (అగ్ని ప్రవేశమునకు ముందు ఏరూపమున నున్నదో) అదే ఆకారములో నున్నదియును;

మనస్వినీమ్ = (అగ్నిప్రవేశము చేయించెనను కోపము ఏ మాత్రమును లేశమైనను లేక) రామునియందు మంచిమనసుతో నున్నదియును; వైదేహీమ్ = (అయిన) విదేహరాజపుత్రియైన సీతను; విభావసుః = అగ్నిహోత్రుడు; అఙ్కేకృత్వా = రెండు చేతులయొక్క అంకముననను తీసుకొనివచ్చి; రామాయ = రామునికొరకు; దదే = ఇచ్చెను.

**తాత్పర్యము** : అగ్నిప్రవేశము వలన ఏ విధముగను క్లేశమునొందని మైపూతలు ఆభరణములతోను పూర్వమువలెనే ప్రకాశమైనరూపముతో నుండి శ్రీరామునియందు మంచిమనసు గలిగినట్టి సీతను అగ్నిహోత్రుడు రెండు చేతుల కౌగిలితోను తీసుకొని వచ్చి రామునికొరకు సమర్పించెను.

శ్లో. *అబ్రవీచ్చతదారామమ్ సాక్షీలోకస్యపావకః,*
*ఏషా తే రామ వైదేహీ పాపమస్యాం న విద్యతే.* 5

**పదవిభాగమ్** : అబ్రవీత్, చ, తదా, రామమ్, సాక్షీ, లోకస్య, పావకః, ఏషా, తే, రామా!, వైదేహీ, పాపమ్, అస్యాః, న, విద్యతే.

**వాక్యక్రమము** : లోకస్యసాక్షీపావకః తదా రామమ్ (ప్రతి) అబ్రవీత్ చ. హేరామ! ఏషాతే వైదేహీ. అస్యాః పాపమ్ న విద్యతే.

**అర్థము** : లోకస్యసాక్షీ = లోకమునకు (లోకములోని కర్మలన్నిటికిని) సాక్షీభూతుడైన; పావకః = అగ్నిహోత్రుడు; తదా = అప్పుడు (సీతాదేవిని రామునకు వప్పగించి); రామమ్ (ప్రతి) = రామునిగూర్చి; అబ్రవీత్ చ = (ఈ క్రింది మాటలను) చెప్పెను కూడాను; హే రామ! = ఓ రామచంద్రా!; ఏషా తే వైదేహీ = ఇదిగో ఈమె నీ సీత; అస్యాః = ఈమెయందు; పాపమ్ న విద్యతే = ఏ పాపమును లేదు.

**తాత్పర్యము** : లోకమునందలి సర్వకర్మలకు సుసాక్షీభూతుడైన అగ్నిహోత్రుడు ఆ విధముగా సీతను శ్రీరామునకు వప్పగించి రామునితో "ఓ రామా! ఇదిగో! నీ సీత ఈమె యందు ఏ పాపమును లేదు."

శ్లో. *నైవ వాచా న మనసా నానుధ్యానాన్న చక్షుషా,*
*సువృత్తా వృత్త శౌణ్డీర నత్వామతి చచారహ.* 6

**పదవిభాగమ్** : న, ఏవ, వాచా, న మనసా, న, అనుధ్యానాత్, న, చక్షుషా, సువృత్తా, వృత్తశౌండీర!, న, త్వామ్, అతి చచారహ.

**వాక్యక్రమము** : నైవవాచా, నమనసా, న అనుధ్యానాత్ న చక్షుషా అస్యాః పాపమ్ న విద్యతే. ఏషా తే వైదేహీ సువృత్తా. హే వృత్తశౌండీర! త్వామ్ న అతి చచారహ.



**అర్థము** : వాచా ఏవ = వాక్కుచేతను గాని; అస్యాః = ఈమెయందు; పాపమ్ = పాపము; న = లేదు; మనసా = మనసుచేతనైనను; అస్యాః = ఈమెయందు; పాపమ్ = పాపము; న = లేదు; అనుధ్యానాత్ చ = అనుధ్యానమునందును; అస్యాః = ఈమెయందు; పాపమ్ = పాపము; న = లేదు; చక్షుషా = చూపునందును; అస్యాః = ఈమెయందు; పాపమ్ = పాపము; న = లేదు; ఏషా తే వైదేహీ = ఈ నీ సీత; సువృత్తా = శ్రేష్ఠమైన వృత్తము (శీలము) కలది; హే వృత్తశౌండీర = సువృత్తవంతులలో శ్రేష్ఠుడవైన ఓ రామా!; శౌండీరః = అన్నమాటకు సరియైన అర్థము కల్లుత్రాగి మత్తిల్లినవాడు అని అర్థము. వృత్తశౌండీర అని సంబోధించుటలో వృత్తమును (శీలమును) నిలుపుకొనుటలో అంత మత్తెక్కి యున్నవాడు అని అర్థము. ఇటువంటి విశేషణములు రాముని విషయములో వాల్మీకి మహర్షి ధర్మభృతామ్ వరః, సత్యపరాక్రమ అని అనేకము ప్రయోగించినాడు. ఏషా తే వైదేహీ = ఈ నీ సీత; త్వామ్ = నిన్ను (ఏ రూపముననను కూడా వాచా, మనసా అనుధ్యానాత్ చక్షుషా); న అతి చచారహ = అతిక్రమించి నడవలేదు, అనుకూల ప్రవర్తనతోడనే సహధర్మమునందే యున్నది అని అగ్నిహోత్రుడు ఏకకంఠముతో ప్రకటించినాడు.

**తాత్పర్యము** : వాక్కుచేత గాని, మనసుచేతను గాని, అనుధ్యానము చేతను గాని, చూపులచేతను గాని, మరి ఏ ఇతర విధములచేతను గాని ఈమెయందు ఏ పాపమును లేదు. ఈమె అన్ని విధములను శ్రేష్ఠమైన వృత్తము గలది. వృత్తశౌండీరుడవైన నిన్ను నీ శౌండీరత్వమునకు అనుకూలముగనే ఏ విధముగను మించి చరించలేదు. సీతాదేవియొక్క శీలమును లోకమునకు తెల్పుటకు రాముడు అగ్నిప్రవేశము చేయించగా రామునియొక్క వృత్తశౌండీరత్వమునకు అగ్నిహోత్రునికి మెప్పు వచ్చి సీతాదేవిని స్వయముగా ఏమియును చెక్కుచెదరనిదానినిగా తీసుకొని వచ్చి మహానందముతో వప్పజెప్పుటయే గాక హే వృత్తశౌండీర అని సంబోధనతో ఆయన మెప్పును వెల్లడి చేసినాడు. శీలరక్షణయందు శ్రీరామునకున్న నిష్ఠను తెలుపుటకు వాల్మీకిమహర్షికి అంతకన్న ఎక్కువమాట కనబడలేదు. ఆ విధముగా భగవంతుని వర్ణించి ఆదికవి ధన్యుడైనాడు.

పూర్వసర్గలో సీతాదేవి అగ్నిప్రవేశము మాత్రమే ఉల్లేఖించబడినది. ఆ సర్గ చివరివరకు అర్థతాత్పర్యములు వ్రాసి సీతాదేవిని అగ్నినుండి తప్పించక అంతటితో విడిచివేయుటకు మనసు ఉత్సాహపడక తరువాతి సర్గలోని ఈ ఆరు శ్లోకములకును అర్థతాత్పర్యములు వ్రాయించినది. ఇవియును ప్రజాదరణ పొందును గాక.